# గౌరీ రామాయణము

THIS BOOK IS PUBLISHED
WITH THE
FINANCIAL ASSISTANCE OF
TIRUMALA TIRUPATHI DEVASTHANAMS
UNDER THEIR SCHEME AID TO PUBLISH
RELIGIOUS BOOKS


చాగంటి గౌరీదేవి
గ్రేడు 1 హిందీ పండిట్ (రిటైర్డ్)
ఆర్. సి. యమ్. హైస్కూలు
పెదబొడ్డేపల్లి. వయా నర్సీపట్నం
విశాఖపట్నం జిల్లా

# గౌరీ రామాయణము

## రెండవ భాగము

సుందరకాండ నుండి ఉత్తరకాండ వరకు

## విషయ సూచిక

### సుందరకాండము



### యుద్ధకాండము

## ఉత్తర కాండము





# శ్రీ గౌరీరామాయణము

## సుందరకాండము

కం:– శ్రీరామ రామయని మది
కోరి భజించెదను సతము కోసలపతికిన్
నీరాజనముల నిడిభవ
భారము దొలగించి వేగ పాలించుట్కై ॥ 1

వచనము:– ఆ సముద్రము జూచి కపివరులందరును తమతమ బలంబులు జెప్పుకొని శతయోజన పరిమితిగల సాగరమును దాట జాలక జాంబవంతుని బురస్కరించుకొని హనుమంతుని కొనియాడి, నీవు దేవాంశసంభూతుడవు, పరాక్రమశాలివి, నీవు దక్క ఈకార్యమును సాధింపగల వారు లేరని, ప్రోత్సాహపరచిన - వాయునందనుడు తన భీమ విక్రమమును దలచుకొని విజృంభించి ఒక్క యుదుటున నా సముద్రమును దాటుకై పైకెగిరెను. ఆ ఉరుకునకా పర్వతమదరి దద్దరిల్లెను. అతని పూనిక కతని పాదముల వద్దనున్న బండరాళ్లన్నియు క్రిందకణచబడెను. మిగిలిన వానరులొక్కసారి తమతమ స్థానములనుండి కదలిపోయిరి. 2

కం:– శ్రీ రామదూతగానా
ధీరోదాత్తుండు హనుమ తేజముతోడన్,
జేరుట కొఱకాలంకను
వారిధి లంఘించి యెగిరె వాయుబలమునన్ ॥ 3

కం:– శతయోజన పరిమితిగల
అతి దుర్గమమైన జలధినతి సాహసియై
చతురత తోనెగిరెడియా
యతులిత బలశాలి జూచి యంబుధివేగన్ ॥ 4

తే.గీ.:–తావు నిమ్మనియడుగకే దరలిపోవు
వాయునందనుగనుగొని వారి విభుడు

వాని సత్త్వమ్ము దెలియంగ వానికెదురు
నిలువ కెరటాలు పొంగెను నింగి వరకు ॥ 5

కం:- మునుదేవత లందరు నను
పనియని ప్రార్థించ సుధను బడయుట కొఱకున్
వినయంబున నణగితినే
ఘనుడగు నామౌనివరుడగస్త్యుడు ద్రావన్ ॥ 6

తే.గీ.:-ఒక్క కోతికి భయపడి యుండనేల
వీని గర్వమ్ము నిప్పుడే వేసరింతు
ననుచు లేచెను అంబుధి యాకసమున
యాంజనేయుని గమనమ్ము నడ్డగింప ॥ 7

వచనము:- హనుమంతుడును ఉత్తుంగ తరంగములతో నెగురు జలరాశిని జూచి, ఈసాగరము నాపయనమున కాటంకము గలిగింపుచున్నది. నేనెట్టులైనను లంకాపురముజేరవలసియున్నది, ఆకాశమార్గమున బోవలెనని యోచించి, అయినను పెద్దలయెడ వినయమున బ్రవర్తింపవలయును కార్యసాధనకు గర్వము బనికిరాదని భావించి, సాగరునకును, వరుణ, వాయువులకును మనస్సునందే అంజలిఘటించి, శ్రీరాముని కార్యార్థమై బోవు నన్ను దీవించుడని వినయమ్ము బ్రకటించి సూక్ష్మదేహుడై రామనామము స్మరించి మరల నెగిరెను. అంతట సాగరుడు శాంతించి అతని శ్రమనివారించుటకై తనలోనున్న మైనాకపర్వతమును బంపెను. ఆ పర్వతము మహావేగమున సముద్రమునుండి పైకిలేచెను. హనుమంతడది జూచి యిది యేదోరక్కసి గాబోలు, నాదారి కాటంకము గలిగించుచున్నదని భీమరూపమున తన ముష్టితో నెట్టిన నాగిరియొక దివ్య రూపముతో నిలచి, వాయునందనా! నీవు శ్రీరాముని కార్యార్థమై బోవుచున్నావు యిట ఒక క్షణమాగి అలసట దీర్చుకొనుము. ఇందలి ఫలమూలములనారగించి యొక్కింత విశ్రమింపుము. ఇంద్రుడు తన వజ్రాయుధముతో పర్వతముల రెక్కలు ఖండించెను. అప్పుడు నీ తండ్రి నన్ను రక్షించి ఈ సాగరమున నుంచెను. అప్పటి నుండియు నిందుమునిగియుంటిని. నీవు వాయుపుత్రుడవని దెలిసి, నీకు

మార్గాయాసము నివారింపవచ్చితినన, హనుమంతుడు సంతోషించి, నీ యుపకారమునకు మెచ్చితిని, కాని ఈ సాయంకాలమునకే నేను లంకానగరమున కరుగవలయును. అయినను నీవు వచ్చితివిగాన నొకక్షణమందుండెదనని, తనకాలాపర్వతముపై మోపి, మరల వాయువేగంబున ముందుకు సాగెను. 8

కం:— అమరాధిపుడంతట తన
అమరుల బిలిపించి యిపుడు హనుమయొకండే
తమకమున నేగుచుండెను
అమరారిపురంబు జొచ్చియవనిజ జూడన్ ॥ 9

తే.గీ.:—ఉక్కు మిగిలిన రక్కసుల్ బెక్కుమంది
గా చుచున్నారు లంకనీ కపిని జూచి
జేరనిత్తురె వీనినా సీత కడకు
ఆంజనేయుండు వారిన డంచగలడె ॥ 10

కం:— పన్నగ జననిని సురసన్
దిన్నగ జనివాని బలముదెలియుట కొఱకున్,
ఎన్నిక జేసితి నిపుడే
మన్నన యేయనిన వారు మంచిదియనగన్ ॥ 11

వచనము:— దేవతల పంపున నాసురసయుభీకరముగా నోరుదెరచి హనుమంతుని యెదురనిలచి మ్రింగబోయెను. హనుమంతుడు వానియాకారము జూచి ఓసి రక్కసీ! నేను శ్రీరాముని కార్యార్థమై బోవుచుంటిని దారి తొలగు మన. ఆ సురస నోరుతెరచి వానిని బట్టుకొన, వాయునందనుడు, నేను రామకార్యము సాధించి మరల వచ్చినీ కాహారమయ్యెద విడువుమన నాసురస. ఓయీ వానరా నీమాట నేను నమ్మను నిన్నిపుడే మ్రింగెదనని భీకరరవముతో నోరుదెరచెను. హనుమంతుడు తన కాయమును పెంచి దానినెదుర్కొన బోయెను. ఆ సురసయు నింకను తన ఆకారమును బెంచెను. అంత వాయునందనుడు సూక్ష్మరూపుడై దాని యుదరమున ప్రవేశించెను. వాని సాహసమునకు మెచ్చి సురస నిజరూపమున నిలచి

వాయునందనా! నీ బలంబును పరీక్షించుటకే దేవతల పంపున వచ్చితిని. నీవద్వితీయ బలసంపన్నుడవు. పోయిరమ్ము. నీకు విజయముకలుగునని బలికి యదృశ్యమయ్యెను. హనుమంతుడును ముందునకు సాగెను. ఇంతలోతన్నెవరో క్రిందికి లాగుచున్నట్లుగా దోచి బరికించి జూడ ఛాయాగ్రాహియైన సింహికయగు నొక భయంకరమైన జలచరము ఆంజనేయుని నీడను గ్రహించి వానిని క్రిందికిలాగుచుండెను. దక్షిణసాగరమున ఛాయా గ్రాహియను రక్కసి గలదని తాను మున్ను సుగ్రీవుని వలన వినియున్నందున తన కాయమును పెంచి దానితో తలపడెను. అట్లు కొంతసేపా సింహికతో పోరాడిదానిని బరిమార్చి దాని రక్తముతో దడిసిన శరీరము గలవాడై అస్తమించు సూర్యబింబముతో సమానముగా శతయోజనపరిమితమైన ఆ సముద్రమున కవ్వల తీరమున గల త్రికూట పర్వతముపై దుమికెను. వాని యురుకునకా పర్వతముదద్దరిల్లి అందలి వృక్షములనున్న పుష్పములన్నియురాలెను. వాయునందనునిపై దేవతలు కుసుమ వృష్టి గురిపించిరోయనునట్లుండెను. ఆ పర్వత శిఖరమునెక్కి జూడనా పర్వతము నానుకొని యున్న భూ భాగమున కవ్వల లంకానగరము గోచరించెను. ఆ వనమంతయు శోభాయమానమై కన్నులకు విందొనర్చెను. ఆ వనసౌందర్యమున కలరి యందునిలచెను. సాయం సమయమున మలయ మారుతములు వీవ తన శ్రమ యంతయు మరిచి నూతనోత్సాహంబు నిండి మనసంతయు సంతోషంబున పొంగి పోయెను. 12

## ఆంజనేయుడు లంకానగరమును ప్రవేశించుట

సీ:— మారేడునేరేడు మామిడి వృక్షముల్
కరవీర ఖర్జూర ఘనరసాల
నారికేళపనస, నాగపున్నాగముల్
చందన వృక్షముల్ జాలగలిగి

సింధూర యశ్వత్థశింశుపాశోకముల్
వకుళ బిల్వకపిత్థ వనములన్ని
నిమ్మ కదంబముల్ నింగినంటుచు నుండె
విరియ బూసిలతలు విస్తరింప. 13

తే.గీ.:—మాలతీ మాధవీలతల్ మధువునింప
తనివిదీరంగ భ్రమరముల్ ద్రావిద్రావి
భ్రమరకన్నెల దరుముచు బడియె వెంట
మధుకరంబులు అన్నియు మత్తుజెంది ॥ 14

వచనం:— సాయం సమయమగుచున్నదిగాన, పట్టణము ప్రవేశింప వలయును. అని ఆ పర్వతమునుండి క్రిందికి దిగెను. ఆ దిగువనెన్నియో కాసారములు జలపూరంబులై, కలహంస, క్రౌంచ, చక్రవాక, చకోర పక్షి సంకులంబులతో, అల్లిబిల్లిగ విరియబూసిన తామరపద్మములతో, నా పద్మములపై వ్రాలి మధువును గ్రోలిగ్రోలి మత్తిల్లిన భ్రమరములతోడను, తామరలకాంతులు తగ్గించుచు తమ సోయగమును వెల్లివిరియ విచ్చుకొనిన కలువలతోడను, కన్నుల కానందము గూర్చు నాసరోవర తీరమున గల చంద్రకాంత శిలా నిర్మితములైన సోపానములును, వానికిరుప్రక్కల నిలువబడిన సాలభంజకలును, నందనవనమునే ధిక్కరించుచున్నట్లున్నది. దూరముఉండి యేగానవచ్చు పెద్దపెద్దగోపురములును, పెద్దపెద్ద బురుజులు గలిగిన కోటయు, గమింపశక్యముగాకయున్నతమై యొప్పుచుండెను. కోటచుట్టునుగల అగడ్తలు మత్స్య, మకర, కూర్మంబుల తోనిండి యుండ, యందు మదగజంబులు జలక్రీడలలో నిత్యము మునిగిదేలు చుండును. భయంకరాకారులగు రాక్షస వీరులాపురము చుట్టును శూల, పట్టిస, ఖడ్గహస్తులై దిరుగు చుందురు. అట్టి లంకానగరమునకుత్తర ద్వారదేశమున నిలచిచూచి హనుమంతుడు ఆశ్చర్యముతో నట్టినిలువబడెను. 15

కం:— సురలైననుగనజాలని
పురమిది గమియింపవశమె, పొందుగకపులన్

దరి జేర్చుచు రాఘవు డీ
పురనాథుని దునిమియెట్లు బొందును సీతన్! 16

కం:- హరచతురాననులిచ్చిరి
సురవైరికి వరములన్ని, శోభిలెదానన్
నరునకు వశమా వీనిని
దురమునగెలువంగ జూడ దుస్సాహసమే || 17

కం:- నేనెటు జొచ్చెదనీపురి,
జానకినెటు గందునిందు, సంగతి వినియున్
మానిని జాడలుజెప్పక
భూ నాయకు వద్దకెట్లు బోయెదమరలన్ || 18

కం:- వాయువు గూడను జొరదీ
నాయకులకు గానబడక నాకెటు జెల్లున్,
బోయినచో బ్రాణంబులు
దీయక విడువంగబోరు తెరవేదియికన్ || 19

వచనము:- అని చింతించి, శ్రీరామచంద్రుని కార్యార్థమై వచ్చితిని గాన, ఆ రామచంద్రుడే నాకు సహాయంబగుగాకయని, మరలధైర్యము దెచ్చుకొని, భక్తితో రామునకు మనోవందనం బాచరించి, ఉత్సాహంబును బెంచుకొని, సూక్ష్మరూపముతో అంగుష్ఠ మాత్రదేహుండై ద్వారప్రవేశము జేయబోయెను. అంతనా పుర ద్వారము నానుకొని యొక రక్కసి భీకరాకారముతో పెద్దగా నార్చి, యోరీ! మర్కటాధమా! ఎందుండువాడవు! నీవిందేల వచ్చితివి? నన్నుగమించిపోగలవే? యని యడ్డగించిన వాయునందనుడు మెల్లగవినయము దీపింప ఈ పురసౌందర్యమును జూడవచ్చితి నంతియేకాని వేరుకాదు. ఇంతకును నీవెవరు? దారివిడువుమన, నారక్కసి, నేనీలంకనుగాయు గ్రామదేవతను. లంకాధీశుని ఆజ్ఞమేరకు నిందుగావుందును. నన్ను దాటి యిందెవరును బ్రవేశింపజాలరు, నీవు వానరుడవయ్యును మనుజభాషణము లాడుచున్నావు. నీవీ పురికి గ్రొత్త వాడవు బగవాడవుగాన నిన్నిపుడే హతమార్చెదనని నోరుదెరచి ముందుకు దుమికిన హనుమంతుడు

తనకాయమును బెంచి, యొక్క ముష్టిఘాతమున నామెయురమున బొడిచెను. వాని దెబ్బకా రాక్షసి దాళజాలక గిలగిలదన్ను కొనిప్రాణములు విడచె. లంకిణిని బరిమార్చి ఆంజనేయుడా నగరముప్రవేశించి, సౌధములపైనుండి దాటుచు, బోవుచుండ, సౌధ ద్వారములకు గట్టినతోరణములందలి ముక్తామణులును, రత్నమాణిక్యములును తమతమ కాంతులు వెదజల్లుచు, చీకట్లను దరుముచుండ, ఆ వెలుగులలో సౌధ ద్వారంబుల శిల్పసౌందర్యముల నీక్షించుచుబోయిన, రాజమందిరమందలి ద్వారములన్నియు సువర్ణమయములై వాని మధ్యలో స్థాపించ బడిన వజ్రముల కాంతులు ధగధగా యమానములై, అంధకారమును బారద్రోలుచుండెను. వాయు నందనుడా వెలుగు నాధారము జేసికొని తిన్నగా రాజమందిరము ప్రవేశించెను. ఆకాశము నల్లని ఛత్రము పగిదినుండ లంకానగరమంతయు నవరత్నకాంతుల ప్రభలీను రత్నకిరీటము వలె రావణుని శిరసున శోభిల్లు చున్నట్లగపడెను. అంజనేయుడు ఆనందాతిశయమున కొంత తడవు వచ్చినపని మరచె తన్మయత్వమందెను. బంగారు పట్టెలు, దంతపు నగిషీలు గల పవడపు కోళ్లు గలిగి, వజ్రవైడూర్య, గోమేధిక, పుష్యరాగ, మరకత, మాణిక్యములతో ప్రకాశించు హంసతూలికా తల్పంబున శయనించియున్న రావణుని గాంచెను. నల్లని శరీరముగల్గి, ఏనుగు తొండంబులవంటి బాహువులు ప్రియురాళ్ల వక్షంబుననిడి, రతి క్రీడల వలన అలసిసొలసి, మధుపాన మత్తుడై నిద్రించు రావణుని వైభవమున కాశ్చర్యము నొందెను. పాన పాత్రల నందించు స్త్రీ ఆ పాత్ర బట్టియే నిద్రించె. తాంబూల మందించు పూబోడి చేతియందలి వీడెము ప్రభువునోటి కందించుచునే నిద్రించెను. ఒకతె రావణుని వక్షంబున శిరసిడి నిద్రించె, మరియొకతె, యతని తొడమీదనే నిద్రించె, యింకొకతె పాదములచెంతను, వేరొకతె హస్తముల మీదను బడినిద్రించెను. యిట్లా సుందరులందరును, అలంకారములు జెదరి,, ముడిచిన పూలునలిగిరాలిపడ, మేనియందలి యాభరణంబులస్త వ్యస్తములై చెదరి, కట్టిన పుట్టంబులుదొలగి, యవ్వనపు బింకములు పొడసూప కదళీతరువులబోలు, నూరువులును, కనక కలశంబుల బోలు స్తనములును, బయటపడ కంచుకంబులు విడువడి, వారు

అర్ధనగ్నంబుగ దీపకళికలవోలె ప్రకాశించుచుండిరి. రావణుని హత్తుకొని నిద్రించు మండోదరిని జూచి, ఈమె సీతయేగానోపునని, నిమేషమాత్రము బరికించి, సంతసంబున గంతువైచి సీతను జూచితినని ఆనందమున పరవశించి మరల యొక్కింత ఆలోచించి, సీతాదేవి రావణుని శయ్యాగారమున నింతనిశ్చింతగా నిద్రించునా? భర్తయనురాగమున దృప్తి జెంది రతి క్రీడల నలసి సొలసి నిద్రించిన ఈతరుణి రావణుని దేవేరిగా నోపు. ఇంతియేగాని జానకీదేవి కాదని నిశ్చయించి, అర్ధరాత్రి సమయమున రహస్యమందిరములలో వారల నగ్న శరీరముల గనుట పాపహేతువని అటనుండి గదలి, నగరము వెలుపల నుద్యానవనముల వెదకుచుబోవుచుండ, అష్టమి చంద్రుడు దయించి తన కాంతులతో ఆంజనేయునకు దారిగనుపింప వచ్చెనోయన చిరువెన్నెల దోచెను.

అశోక వనముప్రవేశించి యొక చెట్టుపైనుండి మరియొక చెట్టుమీదకు నెగురుచు క్రింద బరిశీలించు చుండ అటనట కొన్ని మండపములును, అందు బడి నిద్రించు రాక్షస వీరులను జూచుచుండ చెట్లనీడల వలన నేమియుగానుపింపక నందేదిరుగుచుండెను. ఇంతలో తెల్లవార బోవుచున్నదని సూచించుటకై వేగుచుక్క బొడసూపె. ఆ వేగుచుక్క కాంతి తనకు దోడ్పడనొక శింశుపావృక్షమగుపడెను. దానినధిరోహించి చుట్టును బరికించి, తన నేరక్కసులైన జూచిన మోసమువాటిల్లునని, అంగుష్ఠమాత్రుండై ఆ చెట్టు యాకుల సందున నొదిగి యుండెను. తెల్లవారిన, తరువాత సీతను వెదుక వచ్చునని అచటనే యుండెను. 20

## హనుమంతుడు సీతను జూచుట

తే.గీ.:-జనకసుత జాడచెప్పంగ జలజ మిత్రు
డుదయపర్వత మందున నుద్భవించె
నరుణ కాంతుల తోడనా యాకసంబు
దెల్ల నయ్యెను దిశలన్ని తేజమొందె ॥ 21

తే.గీ.:-ఒడలువిరుచుకు దొరలుచు నువిదలెల్ల
నిదుర మేల్కొని జూచిన నిమిషమందు
గాంతలందరు లేచిన గదలికలకు
చెట్టు లన్నియు నొకపరి పట్టుసడలె ॥ 22

వచనము:- తానున్న చెట్టంతయు నొక్క సారి గదలి ఆ కులురాల్చి సవ్వడి చేయ, అప్పుడే చిన్ననిద్రకు జారిన హనుమంతుడు త్రుళ్లిపడి లేచి క్రిందకు చూడగా, క్రింద నున్నరక్కస వనితలందరును లేచి ఒళ్లు విరుచుకు నిలబడ వారికదలిక గాలి వలన చెట్ల ఆకులురాలిన ధ్వనియే తానుమేల్కొనుటకు కారణమయ్యెనని క్రిందకు పరికించి జూచిన, ఆ వృక్షమూలమున గూర్చున్న శోకమూర్తిగనపడియె. అంత హనుమంతుడా మూర్తి సీతాదేవియని నిశ్చయించి ధ్యానముగా గమనించెను. ఆ ఆభరణముగట్టిన చీర చెరగు సరిగా ఈమెగట్టిన చీర చెరగే, సందియములేదు, అని మహదానందమునొంది, తాను వచ్చినపని ఫలించెనని యుప్పొంగెను. 23

సీ.:- కట్టిన చేలంబు కడుమాసి పోయెను.
జడలు గట్టెను శిరోజంబులెల్ల
విన్ననై వదనంబు వెలవెల బారెనా
నెలవంక పై మబ్బు నిండినటుల
చెక్కిట జెయిజేర్చి జింతించ కనుగవల్
నిండిన నశ్రువుల్ నేలజార
దిక్కుమాలిసుదతి దీనత జెందెను
వానలేకలతలు వాడినట్లు. 24

ఆ.వె.:-రాజసంబుజెదరి రాకాసిమూకలో
వనిత భయముచేత వణకుచుండ
పులుల మధ్యగోవు పోలిక నడలుచు
గాన నయ్యె హనుమ కన్నులకును. 25

తే.గీ.:-రక్కసులచేత జిక్కియా రమణి యిచట
యెండవానల దెలియక యేడ్చుచుండ

యిట్టి యిల్లాలి నెడబాసి యెట్టులుండె
రామ చంద్రుండు దుఃఖ భారంబుతోడ ॥ 26

ఉ:- అక్కట జానకీ సతికి నబ్జభ వుండెటు వ్రాసెనీ గతిన్
జిక్కగ జేసె, రాక్షసుని జేతికి దీనతతోడ నేడ్చుచున్
రక్కసి మూకలోన బడి రాముని నామమునే స్మరింపుచున్
మక్కువకోసలాధిపతి మానిని యెక్కడ లంకయెక్కడో! 27

కం:- ఈ వనితకు నీశోకము
నే విధిరచియించె దైవ మేమనదగు, నా
భూవిభుని బాసియిట్టుల
నీ విపినమునందు నొంటి నేడ్వగ వలసెన్ ॥ 28

వచనం:- అని సీతాదేవిని జూచి దుఃఖించిన వాడై, యిప్పుడీమె తో తనరాకనెరింగించిన, యీ రక్కసాంగనలు బసిగట్టెదరు. గనుక రాత్రిదనుక యిందుదాగి, తరువాత బలుకరింపవలయును. నంతవరకును దొందరపడరాదు. అని యింకను సూక్ష్మరూపియై అకులనడుమ నణగియుండెను 29

కం:- పగలరుదెంచెను వడిగా
దిగులొందిగమించె రాత్రి దినకరుతోడన్ ॥
బగజెంది దాగి యుండెను
గగనము వెలుగొందె నరుణకాంతుల తోడన్ ॥ 30

తే.గీ.:-పట్టణంబంత నెంతయో ప్రభలు జిమ్మ
రాజసౌధంబులన్నియు తేజరిల్లె
ప్రజలు మునిగిరి తమతమ పనులయందు
లోకమంతయు చైతన్యలోకమనగ ॥

వచనము: తెల్లవారిన తోడనే రాజనగరులో భేరీ మృదంగములు మిన్ను ముట్టెను. రాజోద్యోగులు, కార్మిక, కర్షక ప్రజలెల్లరును, తమతమ పనులయందు నిమగ్నులయ్యిరి. అశోకవనంబులోనున్న రాక్షసాంగనల రూపములు జూడ బహువికారములుగను భయంకరముగను గనుపించెను. ఒకతె పెద్దబానవంటి పొట్టతోను, యింకొకతె వికటమైన

నేత్రములతోను, వేరొకతె పెద్దశిరస్సుతోను, ఒకతి దీర్ఘబాహువులు, కురచకాళ్లను గలిగి గుహావలెనున్న వదనగహ్వరముతో భయంకరముగా నుండెను. మరియొక రక్కసి దీర్ఘమైన నాసికను ఏనుగు చెవుల వంటి పెద్ద చెవులును గలిగియుండెను. అంతమంది సుందరాంగనలుండ రావణుడేలనో ఇట్టి వికృతరూపులను, భయంకరాకారులను సీతాదేవికి గాపుంచెను. ఆ స్త్రీలందరు సీతాదేవిని, దిట్టుచు, బెదిరించుచు, మాంసపదార్థములను దినుమనియు మధువును ద్రాగుమనియు బలవంతము జేయుచుండ, సీతాదేవి చెవులుమూసికొని వారి మాటలు విననొల్లక వారికి నమస్కరించి తల్లీ! నాకేమియు వలదు. నన్ను మన్నించి నా జోలికి రావలదని మ్రొక్కుచు, వాయుపానముననే, ఆ వృక్షమున జేరబడి దుఃఖించుచుండెను. వాయునందనుడామె పరిస్థితికి బాధపడి వెంటనే క్రిందికి దూకి ఆమె దుఃఖమును బారద్రోలి, రాముని వార్తను తెలియజేయవలెనని తొందర జెందెను. కాని సమయముగాదని అతి కష్టమున ఆ చెట్టుమీదనే యుండి కన్నీరు గార్చెను. ఈ విధముగా దినముగడచి సాయంసమయమాసన్నమయ్యెను. ప్రజలందరును తమతమ విద్యుక్త ధర్మములాచరించి గృహోన్ముఖులైరి. పక్షులును తమ తమ గూళ్లను జేరి పిల్లలతో కిలకిలారావముల కుశలప్రశ్నలు వేసుకొనుచుండెను. అప్పుడు పట్టణమునుండి ఏదియో! కోలాహలము అశోకవనము దరికి వచ్చుట గమనించి, ఆంజనేయుడతి జాగరూకుడై ఆకులనడుమ నణగి యుండెను. 32

## తన్ను వరించుమని రావణుడు సీతను గోరుట

సీ.:- బంగారు రథమెక్కి భటులెల్లగొల్వగా
వందిమాగధులెల్ల వరుస నడువ
మంగళ తూర్యముల్ మరి మరి మ్రోయంగ
గంధర్వ కన్నెల గానములను

పరిమళ ద్రవ్యముల్ బాగుగా నలదిన
పట్టు పుట్టంబులు ప్రభలుజిమ్మ
వజ్రకిరీటమ్ము వైఢూర్యపతకముల్
కంకణమ్ములు చాల కాంతులీన 33

తే.గీ.:-దేవకాంతలు సేవింప దేవతైరి
యింద్రభోగంబులందుచు నింతిజూడ
వైభవోపేతుడైవచ్చి వనితకెదుర
నున్నతాసనమందున నుండి బలికె ॥ 34

సీ.:- భామరోననుజూచి బలుకరింపవదేల
మన్నించి నాతోడ మాటలాడు,
మెత్తనిచేలముల్ మేనధరింపక
మాసిన చీరేల మగువనీకు,
పరిమళ ద్రవ్యముల్ పట్టుబట్టలువీడి
నేలపై బొరలంగ నేల నీకు
పంచభక్ష్యంబులు పడతినీ వొల్లక
యుపవాసములతోడ నుండనేల 35

ఆ.వె.:-నాతినీకు దగడు నరుడు రాముడుజూడు
వాని కొఱకు నీవు వగవనేల
యింద్రభోగములను నందుమానాతోడ
రాణి వగుము లంక రాజ్యమునకు ॥ 36

సీ.:- అష్టదిక్పతులు నా యాజ్ఞలో నడువంగ
నింద్రుడు నాసేవ నెలమిజేయు
వరుణుడు నే జెప్ప వానలుగురియించు
వాయుదేవుడు వీచు వాటమొప్ప,
నగ్ని దేవుడునాకు నన్నంబు పచియించు
నైర్రుతియే శయ్య నాకు వేయు
దండధరుడు నాకు దండమ్ము బెట్టును
దీవించు నను బ్రహ్మ తేజమిచ్చి 37

ఆ.వె.:-సూర్యుడు దివిటీలు జూపును నాయింట
చుక్కలెల్ల నాకు దిక్కుజూపు
చందమామ నాకు చందన మలదుచు
నూడిగములు జేయుచుందురెపుడు ॥ 38

వచనము:- ఇట్టి మహాభోగంబులు బొందెడి నాపొందు నీకు స్వర్గాధిపత్యము కంటెనుమిన్నగాన, నీ మూర్ఖత్వమును వీడి నన్ను బొందుము. 39

కం:- వనములు దిరుగుచుపసజెడి
దినములు గడుపుచును నుండె దీనుని వలెదా
ననుజుని తోడను రాముం
డనిలోననుగెలిచి నిన్ను నందునె జెపుమా ॥ 40

కం:- హరిబ్రహ్మాదులు సహితము
దరిజేరగలేరు లంక ధారుణియందున్
నరులెటు జెనకె దరిల నను
తరుణీ నామాట నమ్ము దరిజేరు వడిన్ ॥ 41

వచనము:- అని పలుకు రావణుని మాటలకు సీతాదేవి చెవులు మూసికొని, హరహరా! ఎంతటి మాటలు వినవలసి వచ్చెను? అని చింతించి యొక తృణమును చేతబట్టి, ఓరీ రావణా! నీవీ తృణముకంటెను నధముడవు. 42

ఉ:- పాపపుచింతతోడనను బట్టిన నీచుడ నీదుగర్వమున్
దీపిత శక్తితోడనని ద్రెంపక మానడు రామచంద్రుడే
కోపము జెంది నీపురము గూల్చును నిన్నును నీదు సైన్యమున్
నాపతి వచ్చి రూపుసెడ నాశము జేయుట నిక్కమే యికన్. 43

కం:- ఏరీతి సాటి వచ్చెద
వారాముని తోడ రాక్షసాధిప, యెనయే
నీ రాజ్యమనగ నెంతయు
ధీరుడు శ్రీరామచంద్రు దేజము ముందున్ ॥ 44

వచనము:- శ్రీరాముడు సత్యవ్రతుడగు దశరథ మహారాజు కుమారుడు,

మరి నీవో నీవొక పేద బ్రాహ్మణుని పుత్రుడవు. ఈ చిన్న లంకారాజ్యమున కధిపతివి. గాని శ్రీరాముడు కోసల రాజ్యమునకే రాజు. శివధనువు నెక్కిడిన ధీశాలి, పరశురాముని గర్వమడంచిన వీరాధివీరుడు. మారీచ సుబాహువాది రక్కసుల నుక్కడించిన పరాక్రమవంతుడు. అహల్యా శాపోపశమనము జేసిన మహాత్ముడు. తండ్రి సత్యమునడుపుటకై రాజ్యమును త్యాగముజేసి వనముల కరుదెంచిన త్యాగధనుడు. అట్టి శ్రీరామునకు నీవు సాటియా! రామునకును నీకును హస్తిమశకాంతర భేదమున్నది. సూకరమెంత బలసినను గజము కాగలదా! గాజు మెరసినంత మాత్రమున కంకణము గాగలదా! నీవు శ్రీరామునకు సరియగుదువా! నీవు నీచుడవు. పరాక్రమ హీనుడవు. రామునితో జాలలేక, దొంగవేషమున వచ్చి, మోసముతో నన్నెత్తుకొని వచ్చితివి, సిగ్గుమాలినవాడవు. నీకును శ్రీరామునకును పోలికయా! పరదారనగు నన్ను బంధించి దెచ్చితివి. నీకు చావు దగ్గర పడినది. లేనిచో అయోనిజను, జనక చక్రవర్తి కుమార్తెనునగు నన్ను గోరుట, నీనాశమును గోరుటయే! అని పలికిన సీత మాటలకు పౌలస్త్యుడు మండిపడి, యొరనుండి ఖడ్గముదీసి - ఏమీ! నీకింత కావరమా! నాలావు దెలియక వదరుచున్నావు. నిన్నిదే నాఖడ్గమునకు బలియిత్తునని, ముందు కురక ధ్యానమాలిని యను వనిత రావణునడ్డగించి - ఆడుదానిని జంపనేల, నీయందిచ్ఛలేని స్త్రీని బొందిన నీకేమి సుఖము? ఈమెను తలదన్ను సుందరీమణులిందరుండ యీమెయే గావలయునా! పదపదమని యతని జేయిబట్టి దీసికొని బోయెను. రావణుడును అక్కడనున్న రక్కసివనితల జూచి, రెండు నెలలు గడువిచ్చుచున్నాను. మీరీమెను నయముననో భయముననో నాకనుకూలముగా జేయుడు. అప్పుడును వినకపోయిన యీమెను జంపి తినుడని ధాన్యమాలిని వెంటనంతి పురికేగెను.

రాక్షసాంగనలు సీత దరి జేరి తర్జన భర్జనముల బెదరించుచు, ఈ రావణుని సామాన్యుడని భావింపకుము. వీనిని జేబట్టి సుఖింపుము.

కం:- బ్రహ్మవంశమందు ప్రభవిల్లియున్నాడు,
లంక నేలుచుండు శంకలేక.
రామరామయనుచు రావణునెదిరించి
మనగజాలవింక మగువవినుము ॥ 46

వచనము:- బ్రహ్మవానన మ్రతండగు మ్లనవ్యడితనితాత. మహాతపస్వియగు విశ్రవసుడీతని తండ్రి. శివభక్తి దురంధరురాలగు కైకసియను యక్షకాంత యితని తల్లి. బ్రహ్మకు నాలుగవ తరము వాడు. మండోదరితో సమానులగు వేయిమంది సుందరీమణులున్నను, నీయందు మక్కువ గలిగి యున్నవాడు. వీనిని నీవేల వరింపవు. నీకు దగడని దలంచక మామాటలువిని వీనిని బొంది సుఖింపుము, లేనిచో నిన్ను జంపి నమిలి మ్రింగెదము. అన సీత గోడుగోడున నేడ్చుచు నేను మనోవాక్కాయకర్మల శ్రీరామునిదక్క నితరులను దలంచను. 47

కం:- మానవియై జనియించిన
మానిని తన జాతియైన మనుజుని దక్కన్
మానవభక్షకునెట్టుల
నే నియమముతోడ గోరునెరుగరె మీరున్ ॥ 48

వచనము:- అనిన సీతను జూచి యొక రక్కసి మేమెంత బోధించినను వినకుంటివి. యిన్ని మాటలేల నీవు రావణుని కోరిక దీర్చెదవో లేక జచ్చెదవో నిర్ణయించుకొనుమని బలికె యీవెం నోడంబరుపజాలకున్నాము. దీనిం జంపి తినెదము రండన, మిగిలిన స్త్రీలందరును దానిని జుట్టునుజేరిరి. అంతవరకును నచ్చటనే నిద్రించుచున్న త్రిజటయను రాక్షసాంగనలేచి, ఓహో! నాకొక వింత స్వప్నము వచ్చినది. వినుడు. దీని వలన మన రాక్షసకులమునకు కీడు సూచించుచున్నదన ఆస్త్రీలందరు సీతను విడచి ఆమె యొద్దజేరి యేమి కలవచ్చెనెరిగింపుమనిరి. త్రిజటయు - రాముడు తెల్లని యేనుగనెక్కి వచ్చినట్లును, శ్వేతాంబరియైన ఈ సీతను దీసుకొని బోవుచున్నట్లును, రావణుడు నల్లని వస్త్రములు ధరించి

యొడలినిండుగా తైలము బూసికొని, వరాహము నెక్కి దక్షిణదిశగా నేగు చున్నట్లును కలగంటిని. లంకాపురము భగ్నమైన సౌధంబులతో సముద్రమున మునిగిపోవుచున్నట్లు స్వప్నమున జూచితిని. దీనిని బట్టి జూడ నీ సాధ్వివలన మనలంకకుపద్రవము గలుగునని దోచు చున్నది. ఈమెను హింసించిన మనకుహాని వాటిల్లును. ఇప్పుడైనను ఈమెను శరణుబొందిన మనకు మేలు కలుగును. సందేహించక నామాట నమ్ముడన, ఆ స్త్రీలందరును భయభీతులై సీతకు నమస్కరించి దూరముగా బోయిరి. త్రిజట జెప్పిన స్వప్న వృత్తాంతము విని సీత యూరట జెందెను. ఇంతలో వామ భుజంబును నేత్రమును నదిరి శుభము గలుగునని సూచించెను. 49

## హనుమంతుడు శ్రీరామముద్రికను సీతకిచ్చుట

తే.గీ.:-చెట్టుపైనుండి జూచెను సీత దశను
ఆంజనేయుండి దెసమయ మంచుదలచి
సీత వినునట్లు మెల్లగా జెప్పదొడగె,
రాముడంపెను నినుజూడ రమణి వినుము ॥ 50

తే.గీ.:-రఘుకులంబున బుట్టిన రాఘవుండు
తండ్రి సత్యమ్మునడపగా తమ్ముడైన
లక్ష్మణునితోడ తనగృహ లక్ష్మితోడ
వచ్చెనడవికి పదునాల్గు వత్సరములు ॥ 51

ఆ.వె.:-చుప్పనాతి వలన సుదతిని గోల్పోయి
యడవులు దిరుగుచును నడలుచుండి
వానరులను గలసి వనిత జాడదెలసి
వాయుసుతుని బంపె వనిత కొఱకు ॥ 52

ఆ.వె.:-అంజనేయుడంద్రు యవనిలోనన్ను
నిన్ను జూడ బంపె నిజము తల్లి
రక్కసుండు నిన్ను పెక్కుమాటలునాడె

యేమి జరుగ నుందో నెరుగ లేక ॥ 53

కం:- వింటిని రావణు బల్కులు
వింటిని యాత్రిజట సప్నవృత్తాంతంబున్
గంటిని నీ దుఃఖంబును
గంటిని విను తల్లి నీదు కష్టములెల్లన్ 54

కం:- ఇచ్చట నీ దుఃఖంబును
నచ్చట రామునకు దెల్పి నతివేగమునన్,
నిచ్చటకు దోడి దెచ్చెద,
హెచ్చిన కోపమున వీని నెమపురికంపున్ ॥ 55

వచనము:- తల్లీ నీవు దుఃఖింపకుము. శ్రీరామచంద్రుడు, కపివీరులతో వచ్చి రావణుని సంహరించి నిన్ను గొంపోవునని బలుక, అమృతోపమానములగునా పలుకులు విని జానకీ దేవి తలయెత్తి జూచిన ఆచెట్టుననున్న అంజనేయుడగు పడెను. వానిని జూచి సీత సంశయంబున. 56

తే.గీ.:-కలనుగంటిని గాబోలు గాకనిచట
రాముగొనియాడుటిదియేమి రక్కసులకు
గలవు యెన్నెన్ని మాయలో గాననిదియు
రావణునిమాయ యిది నమ్మ రాదు నాకు 57

వచనము:- నేను రామునెడ బాసి నిద్రకు దూరమైతినే! స్వప్నమెట్లు వచ్చునని పరికించి జూచెను. హనుంతుడును చెట్టు దిగి ఆమెయెదుట నిలచి, తల్లీ! ఇది స్వప్నముగాదు, నేను శ్రీరాముని దూతను, నిన్నటినుండియు ఈ చెట్టు మీద నేయుండి, నీతో జెప్పనవకాశములేక యుంటిని. ఇప్పటికి నిన్ను బలుకరింప గలిగితిని. నీ సంశయమును వీడుము. శ్రీరాముడు తనయానవాలుగా నీ రత్నముద్రిక నిచ్చె, నిదే స్వీకరింపుమని ఉంగరమిచ్చి నమస్కరించిన, సీతయు నాయుంగరమును జూచి ఆనందాశ్చర్యములు బెనుగొన కన్నులకద్దుకొని, శిరమునందుంచుకొని, హృదయమునకు హత్తుకొను కొంత సమయము తన్మయస్థితినొందెను. ఆనందభాష్పములు జాలువార వానిని జూచి,

ఓ వానరోత్తమా! నీవింత చిన్న వాడవు, ఆ మహాంబుధి నెట్లు దాటితివి? ఈ లంక నెట్లు ప్రవేశించితివి? ఇదియును రాక్షస మాయగాదుగదా! ఈ ముద్రిక జూడ శ్రీరాముని ముద్రికయే యనిపించు చున్నదని బలుక, హనుమంతుడు తల్లీ! నేను పరాక్రమమును బలమును గామరూపమున గల వాయునందనుడను, ఈ రాక్షసులకనుమరుగై సూక్ష్మరూపమున నుంటిని అని తనకాయమును బెంచి జూపిన సీతాదేవి సంతసమున, ఆంజనేయా! నీవు నిజముగా రామదూతవే, నన్నుద్ధరింపవచ్చిన పరమేశ్వరుడవే, శ్రీరామచంద్రుడు కుశలమేనా! లక్ష్మణుడు క్షేమమేగదా! ఎట్లున్నారు? వారునన్ను దలంచుచున్నారా? వివరముగా జెప్పి పుణ్యముగట్టు కొనుమన, హనుమంతుడు, తల్లీ ఆ శ్రీరామ ప్రభువున వర్ణింపనేనశక్తుడను. అయినను నాప్రభువు, 58

సీ.:- శ్రీరామచంద్రుండు శృంగార గాత్రుండు,
నీలమేఘుంబును బోలువాడు,
ఆజానుబాహుండు, యరవిందనేత్రుండు,
చిరునవ్వుమోమున జిందువాడు,
కోదండరామయ్య కోమలదేహంబు,
తపసి వేషములోన దాగియుండె,
నీలి మొయిలు తోడ, మేలుమెరుపువోలె
అన్నవెంటను తమ్ముడడుగువేయ || 59

తే.గీ.:-అమర రాజ్యమ్మునేయేలు నధికులగుచు
నన్నదమ్ములు హరిహరులనగజెల్లు
కోసలేంద్రుని ముద్దుల కొడుకులయ్యు
దిరుగుచున్నారు కానలో దేవి కొఱకు || 60

కం.:- అని వాయు సుతుడు బలుకగ
విని జానకి డెందమందు వేడుక దోపన్
మనమున దలచెడి రూపము
దన కన్నులబడినయట్లు దన్మయమందెన్ || 61

తే.గీ.:-చేతనున్నట్టి ముద్రికన్ శిరము జేర్చి

నాడు పరిణయమొనరించి నావునేవె
నేడు విభునెడబాసి నేనేడ్చుచుండ
వచ్చియున్నావు నాపతి వద్దనుండి ॥ 62

కం.:- నీ మూలంబున మరలన్
రామునితో పొందుగలుగ రాదేనాకున్,
యీ మనుజాధముడిటుపై
యేమని దండించినన్ను హింసించునొకో? ॥ 63

వచనము.:- అని ముద్రిక తో జెప్పుకొని యేడ్చుచున్న సీతాదేవిని జూచి
అమెనూరడించుచు హనుమంతుడు- 64

కం.:- నా వీపుననిను నిడు కొని
నీ విభుకడ జేర్చగలను నిముషముతోనన్,
నీ విధి బొగలగ నేటి కి
రావమ్మా యిపుడె నీదు రాముని కడకున్ ॥ 65

వచనము.:- అని వాయునందనుడు బలుక జానకీ దేవి, అతని భక్తికి
మెచ్చి, నీవంతవాడవే యగుదువు. 66

కం.:- ఎంతటి ధీశాలివిగా
కింతటి జలరాశిదాటి యీపురమునకున్
వింతగు రూపముతో,నా
చింతను బోద్రోలవచ్చి జేరితివిగదా! 67

వచనము.:- అయినను యీపాపకర్ముడు శ్రీరాముడు చెంతలేని సమయమున
నను మోసగించి దెచ్చి బంధించె, గాన శ్రీరాముడే తన పరాక్రమమున,
రావణుని సంహరించి, నా చెర విడిపించి, నన్ను చేపట్టును. గాన నీవు
త్వరితగతిని బోయి రామునకు నాయీయవస్థనెరిగించి నా చెర
విడిపింపుమని నా మనవిగా జెప్పుము. మరదియగు లక్ష్మణుని
తూలనాడినందుకు ఫలితమనుభవించుచున్నాను. మన్నించుమని
కోరితినని జెప్పుము. అన, హనుమంతుడు తల్లీ! నాకాకలియగుచున్నది
ఈవనమందలి ఫలముల నారగించ నానతిమ్మని వేడెను. సీతయు
నాయనా! పడిన ఫలములనేరితినిన పాపముండదని పెద్దలు

జెప్పుదురుగాన అట్లు జేయుమన, హనుమంతుడామెకునమస్కరించి సెలవొసంగుమన, సీత తన శిరోమాణిక్యమునిచ్చి రాముని కానవాలుగా దీనినిమ్మని జెప్పి దీవించి పంపెను. హనుమంతుడును తాను వచ్చిన పని నెరవేరినయుత్సాహముతో, తనరాక రావణున కెరిగించుటయే మంచిది. ఈగ కూడ తన యాజ్ఞలేనిదే యీలంక జొర జాలదని విఱ్ఱవీగు సీతనికి తన పరాక్రమము దెలియ జేసెదనని- 68

ఆ.వె.:-వనములోన జొచ్చి, వనపాలకులజంప
పరుగులెత్తె ప్రజలు ప్రభువు కడకు,
నొక్క వానరంబు నుక్కడించెను మన
రక్కసులను జంపి రణమునందు ॥ 69

తే.గీ.:-దేవవరులంపి యున్నట్టి దేవ దూతొ
రాముడే జెప్పి బంపిన రామ దూతొ
సీతతోడుత సుద్దులు జెప్పి జెప్పి
వానరుండొక్క డుద్యాన వనము జెరిచె ॥ 70

వచనము.:- రాక్షసవీరుల బల్కులు విని రావణుడాశ్చర్యముతో మంత్రి కుమారుడగు జంబుమాలిని జూచి నీవేగి ఆ కోతిని బరిమార్చి రమ్మని పంపెను. వాడును కోపోద్రేకమున మండిపడుచు, యాంజనేయుని పై వాడి యైన బాణంబులనేయ, మారుతియు నొక పెద్ద శిలను జంబుమాలినిపై బడవైచిన వాడు దాని క్రిందనణగెను. అదివిని రావణుడు యూపాక్ష, విరూపాక్ష, దుర్ధర ప్రఘన, బాసకర్ణులను నైదుగురు వీరులంబంపెను. ఆ ఐదుగురుసేనానాయకులకు దోడుగా అక్షయకుమారుడును వెళ్లి అయుద్ధమున హనుమంతుని చేతిలో చచ్చెను. అదివిని రావణుడు, 71

కం.:- ఎక్కడి వానరమిదియే
దిక్కుననుండేగుదెంచె ధీరత్వముతో
నుక్కు మిగిలి యీభంగిని
రక్కసవీరులను దునిమి రణమున నిలచెన్ ॥ 72

తే.గీ.:-లెక్క సేయక దైత్యుల నుక్కడించి
యమిత బలశాలి నక్షయున్ హతమొనర్చె

యింత ధీ శక్తి యీ కోతి కెట్లు వచ్చె
ననుచు నాశ్చర్యమును బొందె నసురవిభుడు ॥ 73

**హనుమంతుడు రావణునికి నీతి గరపుట**

వచనము.:- అప్పుడు రావణకుమారుడైన ఇంద్రజిత్తు మహాక్రోధంబున నశోకవనమున కేగి అరివీర భయంకరుడై యొడలు బెంచి గగన మద్యంబున దిరుగు వాయునందనుని జూచి యోరీ! మర్కటాధమా! నిలునిలుమని వాడిబాణముల వాని నొప్పించి, వీడు సామాన్యుడు గాడు, జంబుమాలిని, అక్షయుని జంపిన వీరుడు, వీడలతి బాణములలొంగడని బ్రహ్మాస్త్రంబు ప్రయోగించిన, నయ్యది పెనుమంటలతో వచ్చి వాయుసుతుని బంధించెను. హనుమంతుడా అస్త్రంబునకు లొంగి కట్టుబడియె. రాక్షసులు విజయోత్సాహమున వానిని రావణుని సభకుగొంపోయిరి. ఆ సభాభవనమున కాంచనరత్నమయ సింహాసనంబున, అష్టమంత్రి పరివృతుడై యున్న యారావణుడు, అష్టదిక్పతులలో దేవేంద్రుని వలె దేదీప్యమానుండై వెలుగొందుచున్న యావైభవము జూచి హనుమంతుడు తనలో యితడు పరదారాపహారునైయుండెగానిచో యీ ముల్లోకములనే యేలజాలు తేజోవిరాజితుండని యనుకొని యొక్కసారి తనబంధంబుల సడలించినిలచెను. రావణుడాతని జూచి, యోరీ, వానరా! 74

కం.:- ఎవ్వరి వాడవు రా! నీ
వెవ్వరు బంపంగ వచ్చితిచ్చట? కనగా,
నెవ్వరికి జడిసి దొంగై
నెవ్వరి సతి దెచ్చినావు యెరుగవె వానిన్ 75

కం.:- ఆరాముని బంటును నే
నేరావణవినుము, నీవు నొక వీరుడవే!
యారాముని సతి దెచ్చిన
బోరాటముగాక సుఖము బొందగలవే? 76

తే.గీ.:-హనుమయందురు నన్నుని యవని లోన
వాయునందనుడను నేను వాయుబలుడ,
భానుతనయుండు సుగ్రీవు బంటు నేను,
రామచంద్రుని దూతను రాక్షసేంద్ర. 77

వచనము.:- ఆ రామ చంద్రుడసమాన పరాక్రమ తేజోవిరాజమానుడు. తన వాలపాశముననిన్ను ముప్పు తిప్పలు బెట్టిన వాలినే యొక్క బాణమున గూలనేసెను. నిన్ను చెరబట్టిన కార్త వీర్యార్జునుని నిర్జించిన పరశురాముని గర్వమడంచిన ధీశాలి. ఆ మహాత్మున కెగ్గొనరించిన యెడల హరబ్రహ్మాదులు సహితము నిలువ జాలరు, నీ వనగానెంత? ఇప్పుడైనను మించినది లేదు. సీతామాత నతని కప్పగించి ఆ మహాత్ముని శరణుబొందుము. నీ పుత్ర మిత్ర కళత్రాది బంధువర్గంబుతో సుఖంబున నుండుము. యూరక చెడిపోవనేల. అట్లుగాదేని, రాముడే రానక్కరలేదు. నేనే నిన్ను నీ సైన్యముతో నీ లంకతో గూడ సముద్రమున ముంచి వేయగలను. గావున నామాట విని రాముని శరణు బొంది సుఖింపుమని జెప్ప. రావణుడు క్రోధంబున మండిపడి-యోరీ మర్కటాధమా! నీకావరమడంచెదనిదే గాచుకొమ్మని కరవాలముదీసి ముందునకురుక, అక్కడ నేయున్న విభీషణుడు వానినడ్డుకొని. అన్నా! శాంతింపుము. దూతనుజంపుట ధర్మవిరుద్ధము, శిక్షించి బంపుమన, రావణుడు భటులను జూచి కోతికి తోక చాల ప్రియమైనది గాన నీకోతితోకను అగ్నిచే గాల్చి పురంబున ద్రిప్పుడన. ఆ రాక్షసభటులు తోకకు గుడ్డలు జుట్టి తైలంబు బోసి నిప్పంటించిరి. 78

## హనుమంతుడు లంకను గాల్చుట

వాయునందనుడంత వరకును యూరక చూచుచు ఒక్కసారి వారివద్దనుండి యెగిరి మండుచున్న తోకను పొడవుగా బెంచి యొక సౌధమునుండి మరియొక సౌధము మీదికి దుముకుచు తన తోకతో నా భవనముల నన్నియు గాల్చుచుండ. అగ్ని జ్వాలలు రగిలి అచ్చటి.

తోరణ స్థంభములను గవాక్షములను దగ్ధము జేయదొడంగెను. కొందరు రాక్షసస్త్రీలు సీతవద్దకేగి, నీతో మాటలాడిన ఆ కోతి తోకకు నిప్పంటించి పురమున ద్రిప్పుచున్నారని జెప్పిరి. అది విని జానకీదేవి దుఃఖించుచు. అయ్యయో! నాకుపకారము జేయబూనిన యా వానరునకెంత కష్టముగలిగెనని 79

తే.గీ.:—నాదు నాథుండ సద్ధర్మ నాథుడేని
మనము నందున రాముని మరువనేని
చెలగి పతిసేవ లేనేను జేతునేని
యాంజనేయుని గాపాడు మగ్నిదేవ ॥ 80

వచనము:— అని ప్రార్థింప, అచ్చట హనుమంతుడు మండుతున్నతోకతో పురమంతయు గాల్చినను, వానికి ఉష్ణబాధలేకయుండె. నగర మందలి ప్రజలు గోలుగోలున నేడ్చుచు తమతమ వస్తువులను, చిన్నిపిల్లలను, ముదుసలులను అగ్నినుండి రక్షించుకొనుచు, పరుగులు బెట్టదొడంగిరి. లంకానగరము దగ్ధముగావించి సముద్రమున తోక చల్లార్చుకొని యీ అగ్నిజ్వాలలు సీతామాతకే యాపదయుకలిగి లేదుగదయని కొంత తడవు చింతించి, శ్రీరాముని దూతనగుటవలననే అగ్ని నన్ను గాల్చక కరుణించె. నట్టిది సీతామాత కాపదలుగలిగించునా! యని ధైర్యము దెచ్చుకొని సాగరములంఘించి, అంగద జాంబవంతాది కపివీరులగలసి వారలనానందంబున నోలలాడించెను. ఆ వానరులు ఆనందాతిశయమున ఒకరి నొకరు గ్గౌగలించుకొనుచు, మధురఫలంబులారగించుచు, హనుమంతుని ప్రశంసింపుచు వాలములు ద్రిప్పుచు తమ సంతోషమును ప్రకటించిరి. అంగదుడును హనుమంతుని గౌగలించుకొని 81

తే.గీ.:—దుర్గమంబైన యా జల మార్గమందు,
జొరగ రానట్టియాలంక జొచ్చినావు,
రాముసతి జూచి, నెరవేర్చి రాజునాజ్ఞ
మాదు ప్రాణాలు నిలిపితే మహితతేజ॥ 82

వచనము:— అని పొగడెను. వానరులందరును ఆనందార్భాటమున గెంతుచు,

సుగ్రీవుని మామయగు దధిముఖుని రక్షణలోనున్న నందనవనమునే ధిక్కరించు మధువనముజొచ్చి. అంగదుని ఆజ్ఞతో అందలి ఫలపుష్పంబులన్నియు చిందరవందర జేసి, ఫలములుదిని, మధువునుగ్రోలి, మత్తుజెంది ఒకరిపైనొకరు బడి ఆడుచు బాడుచునుండ, ఆ వనపాలకులు వానరులందండించబోగా ఆ వనపాలకులను రక్కియు, జీరియు, కాళ్లను, జేతులును గలిపి కట్టి ఈడ్చిరి. అంత వారందరును నేడ్చుచు, రామలక్ష్మణ సహితుడైయున్న సుగ్రీవుని పాలికిబోయి వానరుల దుండగములు జెప్పిన, సుగ్రీవుడు వారలనోదార్చి భయపడవలదు. హనుమ దంగదాదులు సీతాదేవిజాడలు గనుగొని వచ్చిరిగానోపు. అందుచేతనే ఆనందంబున వనమందలి ఫలములందిని మధువును గ్రోలిరి, యని నిశ్చయించిన వాడై రామునకాశుభవార్త దెలియజేసెను. ఇంతలో హనుమంతుడు అంగద, జాంబవంతాది కపివరులతో విజయోత్సాహమున పెద్ద కోలహాలముగా వచ్చిరి. ముందుగా హనుమంతుడు రామునకు ప్రణమిల్లి - 83

తే.గీ.:-చూచివచ్చితి రామయ్య సుదతి సీత
నిన్నెదలచుచు బ్రాణముల్ నిలిపెసుమ్మి,
సేమమేయనినేనెట్లు జెప్పగలను
నీదునామమునే గ్రోలి నిలచియుండె|| 84

తే.గీ.:-నిద్రహారంబు లెరుగక నిన్నె దలచి
తన్ను బాధించురక్కసి తరుణులందు
సింహముల మధ్యగా లేడి చేరినట్లు
వాయుభక్షణమేజేసి వనితయుండె || 85

వచనము.:- అని విన్నవించిన వాయునందనుని గౌగలించికొని రాముడు ఆనందభాష్పములు జాలువార, నీవు నా సీతను జూచి వచ్చితివా! నా దేవి బ్రతికియే యున్నది గదా? యని దుఃఖించు రాముని యూరడించి సీతావేవి తనకిచ్చిన శిరోరత్నమును రామునకిచ్చి నమస్కరించెను. రాముడా చూడామణిని జూచి సీతను జూచినట్లుగాభావించి దుఃఖము, ఆనందమును ముప్పిరి గొన, అంజనేయా! నేనిక సీతను జూడక

నిలువలేను. నన్నెట్లైన నాసీత వద్దకు గొని పొమ్ము॥ 86

తే.గీ.:-కనులు మూసినదెరచినా గాంతరూపు
గానబడుచున్నదేనాకు గనులముందు
నెట్లుసైరింతునీదుఃఖ మేది దారి?
ఎట్లు జేరుదు నాలంక యెరుగ జెపుమ ॥ 87

కం.:- అని వాపోయెడి రాముని
యనిల సుతుడు సేదదీర్చి యడలకు మనుచున్
వనితనుదెచ్చుటకిప్పుడు
కనుగొనవలె నొక్క దారి కడలిని దాటన్ ॥ 88

వచనము.:- అని రామునకు ధైర్యము జెప్పుచు, లంకలో తాను జూచిన విశేషములును, అచ్చట జరిగిన సంగతులును జెప్పుచు రామున కానందము గలిగించెను. అంతట రాముడు లక్ష్మణుని సుగ్రీవుని బురస్కరించుకొని లంకను, జేరుటకై యేమి జేయవలయునోయని, ఆలోచనలతో అనాటికి ప్రొద్దుపుచ్చెను. 89

గద్యము.:- ఇది ఆత్రేయ గోత్రోద్భవులును ఆర్వేల నియోగి బ్రాహ్మణులును చాగంటి వంశీయులునగు జోగి రాజుగారి ధర్మపత్నియు శివభక్తి దురంధరురాలును " శ్రీ వామ లింగేశ్వర చరిత్ర" మను కావ్యకృతి కర్త్రియునగు గౌరీదేవి విరచితంబగు
" గౌరీ రామయణము" నందలి సుందరాకాండ సంపూర్ణము

# శ్రీ గౌరీరామాయణము

## యుద్ధకాండము

కం:- శ్రీరామా! గుణధామా
శ్రీరఘువంశాబ్ధిసోమ శ్రితజనపాలా!
వీరాధి వీరదనుజవి
దారా! జగదేకవీర దశరథరామా! ॥ 1

ఉ:- అంగదుడాదిగా కపుల నందర దేడ్కొని యాంజనేయుడు
త్తుంగ తరంగమాలికల దుర్దమ సాగరబంధనమ్మునే
భంగి నొనర్పగానగు నుపాయము జెప్పుమ జాంబవంతనీ
చెంగటనుంటి మీ జలధి జీరెడి మార్గము నీవెరుంగవే? 2

తే.గీ:- అనుచు వేడిన వారితో ననియెనిట్లు
తండ్రి యిచ్చిన వరబల తంత్రమునను
నీలుడున్నాడు మనకేల నీటి చింత
యాతడే నీటినరి కట్టనధిక బలుడు । 3

తే.గీ.:- చిన్న నాటను నీలుడు చిన్ని చిన్ని
వస్తువులనెల్ల నీటిలో బారవేయ
తనయునే మనజాలక దండ్రి బలికె
యితనిచే నీట బడి దేలు నేదియైన ॥ 4

తే.గీ.:- గాన నీలుడు వారధి గట్టగలడు
పర్వతములన్ని నీతడే పట్టి ముందు
నీటి యందున వేయంగ నిలువగలవు
బండలన్నియు గొనివేగ దెండు మీరు ॥ 5

కం:- అది విని యుత్సాహంబున
గదలిరి వానరులు వేగ కలకల మొదవన్.

పద పదమని తమలోతము
గదలును పలుగులును బూని కదలిని గట్టన్ ॥ 6

కం:- శ్రీరాముడు సుగ్రీవుని
జేరి బలికె వేగనీవు జేయుము బనులన్,
బోరగ వలయును రక్కసి
వీరులతో మనము వెడలి వేవేగంబే ॥ 7

కం:- అంతట నా కపులందరు
వంతులు వారిగను దెచ్చె వర పర్వతముల్,
గంతులు వేయుచు నుండిరి
సంతసమున రామ కార్య సాఫల్యముకై ॥ 8

కం:- సాగరతటమ్మున నిలచియు
వేగముతో నెగురుజలధి వీక్షించుచు నం
దీగతి బొంగెడి దీనిని
నేగతి నరికట్టి మార్గమేర్పరుపవలెన్ ॥ 9

వచనము:- అని శ్రీరాముడు కొంత తడవు యోచించి కపుల కార్య దీక్షకు సంతసించి వారల పనుల కాటంకము గలిగించునటులున్న సముద్రమును జూచి చండకోపియై 10

తే.గీ.:- అణచివైతును నేను నీయాగడంబు
నగ్ని బాణంబుచే నిన్ను నారజేసి
కపుల బనులకు సులభత గలుగజేతు
ననుచు సంధించి బాణమ్ము నపుడెబట్ట 11

కం:- గడగడ వడకుచు సాగరు
డడలుచు నొక పురుష రూపమందుచునపుడే,
తడబడి రాముని పదముల
బడి వినయముతోడ బలికె భక్తిదలిర్పన్ ॥ 12

తే.గీ.:- నీకు నడ్డమ్ము నిలతునా నీరజాక్ష
తెరవుగట్టుడు నామీద తెప్పనగుదు
నిన్ను సేవించు వానరుల్ నన్ను బట్ట
నిలచి నీ పాదములు దలనే ధరింతు ॥ 13

వచనము:- అనినంతరంగములణగి సరోవరంబువలె నుండెను. 14

తే.గీ.:- చల్లబడి యుండెనప్పుడా సాగరమ్ము,
యుల్లసంబున వానరులురుకుచుండ,
నేలఘూనిన గతిదోచె నిలచినట్టి,
కోతిమూకలజూచియా కోసలపతి, 15

తే.గీ.:- చూడులక్ష్మణా వీరిని జోద్యమయ్యె
ధైర్య సాహసమందు నుద్దండులగుచు
ముజ్జగంబుల యందున్న ముత్యమైన
పట్టగలిగిన వారలే దిట్టలగుట 16

తే.గీ.:- లంకయనవీరికేమైన జంకుగలదె
రక్కసుల వీచమడచగా దిక్కులదర
నుక్కు ముక్కలె వీరిలో బెక్కుమంది
కార్యఫలమున కింకేమి గలదు చింత ॥ 17

వచనము:- అని రామచంద్రుడు కపుల కార్యనిర్వహణకు సంతసించుచుండ - 18

తే.గీ.:- అచటనున్నట్టి చెట్టుపై, అందమైన
యుడుత యొండుండె తన చిన్ని బుడుత తోడ,
చిన్ని యుడుతకు నిదియంత జిత్రమయ్యె
జూచువారది. రాముని జూచు మరల ॥ 19

ఆ.వె.:- ఉరికె చెట్టునుండి యుడుత వేగమ్మున,
నీటముంచి తోక నిలపి మరల
యిసుక నందుముంచి యింపార రాల్చుచు
గపులతోడ గట్టు గట్టుచుండె ॥ 20

ఆ.వె.:-దాని భావమరసి దశరథరాముడు
చేరదీసి దాని జేత బట్టి
బుజ్జగించె చాల మురిపెంపు ప్రేమతో
వీపు మీద చేయి వేసి నిమిరె ॥ 21

ఆ.వె.:-రాము ప్రేమయనెడి రంగులు దిద్దుకు

ధన్యమయ్యె యుడుత ధరణిలోన
ప్రభువు సేవ జేయు ప్రజలకు భాగ్యముల్
గలుగ గలవటన్ని గల్లయగునె ॥ 22

వచనము:- రామభక్తి దత్పరులగు నావానరులమితోత్సాహంబున, పగలంతయు శ్రమించి పదియోజనముల మేరకు వారధి గట్టి సూర్యాస్తమైన తదుపరి రామునిచెంతకు వచ్చి నమస్కరించి, సెలవంది విశ్రమించనేగుచుండిరి. వానరులు తమనిద్రలోగూడ కొండలు పెకలించుచున్నట్లును, తరువులు మోసుకొనివచ్చుచున్నట్లును కలలుగనుచు, అహర్నిశలు సేవయందె చిత్తము లగ్నముజేసికొని యుండిరి. 23

## రామునకు సీతనప్పగించుమని రావణునికి విభీషణుడు బోధించుట

అక్కడ లంకానగరంబున రావణుడు మంత్రి సామంత, పుత్ర మిత్ర, రాక్షస పరివృతుడై కొలువు కూటముననుండ, వేగులవారు వచ్చి, రాముడు సోదర వానర సహితుడై సముద్రమున మార్గం బేర్పరుచుకొనుచున్న సమాచారము నెరిగించిన, విని ఆశ్చర్యమానసుండై కొంతతడవాలోచించి -

తే.గీ.:- నరుని పంపున నొక్కవానరము వచ్చి
చిత్రముగ జలధి లంఘించి జేరి లంక
గదిసి కావలి వారల గన్ను గప్పి
నగర మంతయు జేసెను నాశనమ్ము ॥ 24

కం:- వానరయుతుడై రాముడు
దానవులంజెనక వచ్చె దరిదాపులకే
మానవులని జూడకయా
వానర మానవులజంపి వరలగ వలయున్ ॥ 25

కం:- నరులన్నదమ్ములిద్దరు

గరువంబున జలధి దాటగా దలచిరి వా
నరులను దోడుగనిడుకొని
గరిపై లంఘించదలచు గప్పల బోలెన్ ॥ 26

కం:- అరివీర భయంకరుడే
సురవైరిని దెలియ రొక్కొ జూడగవారల్,
నరులతి సుకుమారులు వా
నర మూకలతోడ వచ్చినను బట్టుదురే ॥ 27

వచనము:- అని పేరోలగమ్మున రావణుడు బలుక, మంత్రులగు ప్రహస్తుడును, ధూమ్రాక్షుడును, మహాకాయుడును, అతికాయుడును, మహోదరుడును, వజ్రదంష్ట్రుడును, అగ్నికేతుండును, రశ్మికేతుండును మొదలగు వారు, మహారోషంబు, కరవాలంబులబెరకి, ఆనరులను వానరులను గూడనిప్పుడే బరిమార్చెదము, మాకానతిండని వీరావేశంబున బలుక, విభీషణుడు వారల శాంతపరచి, మనయందు తప్పుగలదు, వారలనని ప్రయోజనమేమి? యొక్క వానరుడు, ధైర్యంబుగా వచ్చి సభాసదులను, రాజును నుద్దేశించి, న్యాయ, ధర్మంబులు దెలియజేసె, నదివారియౌన్నత్యంబునే సూచించు, గాని అల్పత్వముగాని, తప్పుగాని కాదు. ఆ కోతి అశోకవనమును బాడుజేయునప్పుడును, లంకను దగుల బెట్టినప్పుడును, మీ పరాక్రమమేమయ్యె? అదియును గాక 28

కం:- నాడు మన శూర్పనఖ తా
నాడుదియై లజ్జ వీడి యరిగుయు వారిన్
జూడగనే మోహంబున
గూడదలచినంత వారు కోపించరొకో! 29

కం:- కామినియై జనియటకున్
రాముని సతి మ్రింగబోవ రక్కసియనుచున్
రాముని తమ్ముడు దానిని
బాములు బెట్టుటయు వారి పాపంబగునా! 30

వచనము:- దాని మాటలు విని సత్యాసత్యంబును, యుక్తాయుక్తంబులును

విచారించక ఖరదూషణులు వారలంగవయ రామలక్ష్మణులు పరాక్రమముతో వారల హతమార్చుట వారిదోషమగునా? ఆడుదాని మాటలు విని గోరంతలు కొండంతలు జేసి మాయోపాయమున రాముని సతినపరించి దెచ్చుట మనరాజు దోషముగాదా! ఆనాడే శూర్పనఖను మందలించిన, ఇంతవరుకు వచ్చెడిది కాదు. రాజైనవాడు, సత్యమును, న్యాయమును విడచి, అధర్మప్రవర్తనుడైన దేశమునకే ముప్పువాటిల్లును. యింతమంది రక్కసవీరుల నొక్క కోతి మడియించెనన సామాన్య విషయముగాదు. ధర్మము వారి పక్షమందున్నది, యందువలననే, దానికా బలము గలిగినది. గనుక నిప్పుడైనను, మన తప్పును దెలిసికొని సీతాదేవిని రాముని కర్పించుట తక్షణ కర్తవ్యము. పరసతిని బట్టుట పాపముగదా! అని రావణునుద్దేశించి, అన్నా! నీవు మహా పరాక్రమ సంపన్నుడవు, వేదవేదాంగ పారంగతుడవు, ధర్మవేత్తవు, శివపూజా దురంధరుడవు, బ్రహ్మ వంశసంజాతుడవు, నీయంతటి మహోన్నత మూర్తికి పరదారాపహరణము దగునా! ధర్మమును త్యజించిన కీర్తి నశించును, యిప్పుడైనను జానకీదేవిని శ్రీరామునకునిచ్చి, నీ అపరాధమును మన్నించుమని, యతని శరణు బొందుము. నీవు నీ పుత్రమిత్ర కలత్రాదులతో సుఖంబున నుండుము. రాక్షసకులమును కాపాడుము. నేను నీకు జెప్పందగిన వాడనుగాను. అయినను నీ క్షేమము గోరి జెప్పితిని. నామాటలుమన్నించి యోచింపుము. అదియుగాక కైలాస పర్వతమును బెకలించిన నిన్ను నోడించిన మహాబలశాలి వాలిని జంపిన వీరుడు. కార్తవీర్యార్జునిని ఖండించిన పరశురామునే జయించిన బలశాలి. నీవు మోపెట్టజాలని శివధనువునే యెక్కిడిన, పరాక్రమశాలి, అట్టి రామునితోవైరముదగదు, అని విభీషణుడు బలుక రావణుడు దిగ్గునలేచి - యోరీ తులువా? పగవారి పెంపునుగ్గడించుచు నన్నవమానము జేయుదువా! నిన్నిదేనా ఖడ్గంబునకు బలియిత్తునని ముందునకురుక - మంత్రియగు ప్రహస్తుడు వానినడ్డగించి శాంతపరచిన, రావణుడు తన మంత్రితో

యీదుష్టుని ముఖంబు జూడనేప, నాపెంపు సైరింపజాలక
జ్ఞాతిమత్సరంబున నన్నెదిరించుచున్నవాడు. వెంటనే వీనిని నా
రాజ్యమునుండి వెడల(దోయుడని, సభను వినర్జించి,
అంతిపురమునకేగెను. విభీషణుడును 31

ఆ.వె.:-అన్నచేత తాను, నవమానమును బొంది
చిన్నబోయి తల్లి, చెంతజేరి
అన్నయన్నమాటలన్నియు వినిపించి
అమ్మ, నేను బోవ, నాజ్ఞనిమ్ము ॥ 32

తే.గీ.:- అనుచు జెప్పిన తనచిన్న తనయుజూచి
తల్లి కైకసి యెంతయో తల్లడిల్లి
చిత్తమందున జాలగ చింతజెంది
వంశమే నాశమగునని వగచి బలికె ॥ 33

తే.గీ.:- ఆదివిష్ణువు రాముడం చరయలేక
రణము సేయంగ దలచెను రావణుండు,
దానవుల కంత్యకాలమ్ము దాపురించె
దప్పదికదీని నరికట్ట దరమె మనకు ॥ 34

ఆ.వె.:-ధర్మమూర్తియైన దశరథరాముని
జెంత జేరి సుఖము జెందుమయ్య
కనికరించునిన్ను కౌసల్యాతనయుండు
బోయిరమ్ము శుభము బొందగలవు ॥ 35

వచనము:- అని దీవించి సెలవిచ్చిన తల్లికి వందనం బాచరించి, తనకు
హితులైన నల, నీల, హిత, సంపాతులను నలుగురు మిత్రులతో
బయలుదేరి ఆకాశగమనమ్మున శ్రీరాముడున్నతావునకు వచ్చెను.
వారలజూచి వానరులారాక్షసులుజంపబోవ, విభీషణుడెలుగెత్తి 36

కం:- శరణు శరణు రామయ్యా!
శరణం మాంపాహి రామ శరణు మహాత్మా!
కరుణించుము దీనాత్ముల
శరణని యారామచంద్రు చెరణములబడెన్ ॥ 37

కం:- రావణు తమ్ముండితడని
గావక విడువంగబోకు కౌసల్యసుతా!
మావలన తప్పుగలిగెను
గావున శరణంబొసంగి కావుము మమ్మున్॥ 38

వచనము:- శరణని విభీషణుడు రాముని పాదముల బడివేడ సుగ్రీవాది కపివీరులు వానిని వెనుకకు ద్రోసి వుచ్చి, రామచంద్రా! వీని మాటలు నమ్మరాదు, రక్కసి మాయలు బన్నుచు మనల హింసింప వచ్చిన రావణుని భటులు, వీని నిక్కడనే మట్టి పెట్టెదమనగా, విభీషణుడు గడగడ వడంకుచు, రాముని పాదములంటి, మహాత్మా! నేను రావణుని తమ్ముడను విభీషణుడను. సీతావహాతను రామునకప్పగించుమని మా అన్నయగు రావణునికి నీతిగరుప, నన్ను దన్నిదరిమెను, నా మాటసత్యము. పంచభూతముల సాక్షిగా జెప్పుచున్నాను నేను నీ భక్తుడను, నా తల్లియగు కైకసిదేవి యనుమతిని నీ శరణుజొచ్చితిని నా మాట నమ్ముమని ప్రార్థించెను. అప్పుడు వాయునందనుడు శ్రీరామునితో, రామా! వీని మాటలు సత్యములు. లంకానగరమున నేనానాడు రావణునికి నీతి బోధింప నన్ను జంపబోయెను. అప్పుడీతడు రావణుని వారించి దూతను జంపుట న్యాయవిరుద్ధంబని బోధించిన మహాత్ముడు. వీని మాటలు నిజమే గావచ్చుననన, రాముడు - 39

కం:- పగవాడైననుగానీ
దగ శరణంబన్నవాని దాలిమితోడన్,
బగగొనక గావ వలయును
దగు ధర్మంబదియె జూడ ధరణీపతికిన్ ॥ 40

కం:- అభయంబిచ్చుట బొందుట
నుభయులకును సేమమగును నుత్తములకు నీ
యభయము గీర్తిని బెంచును
నభయంబును మించు ధర్మ మవనినిగలదే ॥ 41

కం:- కావున వీనికి రక్షణ

గావింపగ వలయు నిపుడె, గావున మీరల్
భావించుడి మిత్రునిగా
బ్రోవుదు శరణన్నవాని బుడమిని నెపుడున్ ॥ 42

వచనము:- అని శ్రీరాముడు వానరులకు జెప్పి విభీషణుని లేవనెత్తి యతని భయముదీర్చి యాదరించిన, విభీషణుడు తనకును తన యన్నయగు రావణునకును జరిగి సంభాషణ దెలియజేసిన, విని, రాముడు, విభీషణా! నేటి నుండి నీవు సుగ్రీవుని వంటి మిత్రుడవని బలికి ఆదరించి, లంకా రాజ్యమందలి విషయములు జెప్పుమనిన - విభీషణుడు రామచంద్రా! వినము.

కం:- వరబలగర్వితుడై యా
సురవైరి దిశాధిపతుల స్రుక్కగజేసెన్
పురహరుని భక్తిగలిగియు
యరి వీర భయంకరుండు నైయుండెజూమీ॥ 44

తే.గీ.:- కుంభ కర్ణుండు గలడొక క్రూరబలుడు
మధ్యముడు వాడు మాలోన మానవీయ
శక్తి గలవాడు యెంతయో యుక్తితోడ
చిత్ర మైనట్టి యుద్ధముల్ జేయగలడు॥ 45

కం:- లావును బలమును గలిగిన
రావణ తనుజాతుడింద్ర రాజ్యమునైనన్॥
గావలసిన జేకొనగల
ధీవరుడాయింద్రజిత్తు దేజమునందున్॥ 46

తే.గీ.:- మేఘములయందు దాగియ మేయశక్తి
బాణశతములు గుప్పించు బాహుబలుడు
చిత్ర గతులను నేర్చివి చిత్రమైన
యుద్ధ విద్యలు నేర్చిన యోధుడతడు ॥ 47

వచనము:- ప్రధాన మంత్రియగు ప్రహస్తుడు మహాపరాక్రమవంతుడు. అకంపనుడు, మహావీరుడు, అష్టవిద్యలయందును ఆరితేరిన మణిభద్రుండను గంధర్వునే గడగడలాడించెను. కుంభుండును,

నికుంభుండును, మహోదరుడును, మహాపార్శ్వుడును, అతికాయుండును, మహాకాయుడును, నరాంతకుడును, దేవాంతకును, అగ్ని కేతుండును, రశ్మికేతుడును అనువారు మహాబలవంతులు. అపార శక్తి సంపన్నులునునైన రాక్షస వీరులు గలరు. ఇంకను పదికోట్ల రక్కస వీరులా కోటను నగరంబును అప్రమత్తులై గాచుచుందురు. అనవిని శ్రీరాముడు 48

తే.గీ.:- ధర్మచింతనలేకయే దాగియుండి
యతివ గొంపోయె మాయచే నట్టి వార
లెట్టి బలశాలురైనను మట్టు బెట్టి
లంకరాజ్యము నీకిత్తు శంకలేక || 49

వచనము:- ఆ రావణుని హతమార్చి యాలంకారాజ్యమున నిన్నభిషేకింతును. ఇదే నా ప్రతిజ్ఞ, బ్రహ్మాదులడ్డుపడుగాక, ఆ పౌలస్త్యుని విడచిపెట్టనని బలికిన లక్ష్మణుడును సుగ్రీవుడును సంకుచితాంతరంగులై ఇదియేటి ప్రతిజ్ఞయని సందేహముదోప లక్ష్మణుడిట్లనియెను. 50

కం:- సురవైరి తనదు తప్పును
బరబలమును దెలిసి వచ్చి ప్రార్థించివడిన్
గరుణించుమనుచు బలికిన
శరణంబిడి యతని రాజ్యసంపద నిడరే? 51

ఆ.వె.:- అనుచు బలుకు ననుజు ననుమానమును జూచి
రాముడనియె, వినుము, రావణుండె
వచ్చి శరణమన్న వలదందునే వాని
నాదరించి యిత్తు నయ్యయోధ్య || 52

వచనము:- అని బలుకు శ్రీరాముని వాక్యములకలరి యాతని యౌదార్యంబును బ్రశంసించిరి. రాముడు లంకారాజ్యమప్పుడే విభీషణునకు ధారబోసెను. వానరులును విభీషణుని మన్నించి యతని సహాయ సహకారములతో సేతు నిర్మాణమునకు బూనుకొనిరి. దశయోజన విస్తారమును, శతయోజనాయతంబునుగా సేతువు

నిర్మించిన వానరయోధులను గనుగొని, అమరులమందానందంబున నుగ్గడించుచు వారలకనేక విధంబుల నాయుర్భాగ్యములును శక్తి సామర్థ్యంబులును వరములుగా ప్రసాదించిరి. కపులందరును, ఇనుమడించిన యుత్సాహముతో రామునికి నమస్కరించి బయనము గమ్మని విన్నవించిరి. అట్టి సమయమున రావణుని పంపున శుకుడను నొక రాక్షసుడు దూతగా సుగ్రీవునొద్దకు వచ్చి, రావణుని మాటలుగా – "సుగ్రీవా! నీకును నాకును వైరములేదు. నిన్ను నా మిత్రునిగా భావింతును. రాముని విడిచి నీసేనతో కిష్కింధకు బొమ్ము. పరులకొఱకు నీవును నీ సైన్యమును జావనేల. నీవు దప్పుకొనుము. మేము మా బలంబులు జూచుకొందుము. నీ సేమముగోరి జెప్పిన మా మాటవినుము." అని సందేశమును వినిపించిన రక్కసుని బట్టి, ముక్కును జీరి, రెక్కలనుదునిమిన, వాడు భయభ్రాంతుడై పారిపోయెను. శ్రీరాముడును వరుణదేవుడు తనకిచ్చిన కవచము ధరించి, ధనుర్బాణములు జేతబూని శుభముహూర్తంబున ఆంజనేయుని మూపున గూర్చునగా లక్ష్మణుడంగదుని మూపుపై గూర్చుని బయలు దేరిరి. వానరులమితోత్సాహమున గంతుచు దుముకుచు కతిపయదినంబులు వారిధి గడచి యావలి తీరమున గల సువేలా పర్వతముపై విడిసిరి. ఆ వార్త విని రావణుడు కొంత కలత జెందిన మనంబున – 53

కం:– రాముడు కపిసహితుండై
భీమబలంబుననను వచ్చె భీకరలీలన్
సామము భేదముదానము
చేమరి కార్యంబు చక్కజేయంగలమే ॥ 54

వచనము:– మంత్రుల బిలచి యిప్పుడు మన కర్తవ్యంబెద్దియన, ఇంద్రజిత్తు దండ్రినిగనుగొని – మేటి వీరుల మైనమనమేడ! యానరవానరులేడ! దేవాదిదేవతలనే జయించి బానిసలంజేసి వారిచే యూడిగములు జేయించిన నా భుజశక్తి, రామ లక్ష్మణులనే గాదు, హరిహరాదులనే యెదుర్కొనగలదు. ఇట్టినేనుండ మీకు సందేహమేల! ముల్లోకములనే

గడగడలాడించిన రాక్షసేశ్వరుడవు. అల్పులగు నరవానరు గురించి దిగులేల? మీరానతిచ్చిన, నేనిదే యానరవానరుల నుగ్గుజేసి, యా జలధి యందు బడ(ద్రోయనే, యన యతికాయుడు లేచి అన్నయగు ఇం(ద్రజిత్తు మాటలు ఖండించుచు - నానరవానరులట్టులని భావించరాదు. ఆనాడు ఒక్కవానరము మహాంబుధిని దాటి అభేధ్యమగు లంకానగరము (బవేశించి, అశోకవనము జెరచి, వీరుడగు అక్షయకుమారునే హతమార్చి క్షణములో పట్టణమంతయు దగ్ధమొనర్చి, జానకీ దేవిని గలిసికొని తన కార్యమును సాధించుకొనెను. నిండుపేరోలగంబున, అరివీర భయంకరుడగు తం(డిగారి యెదుట నిలచి ధైర్యసాహసంబులు దీపింప ధర్మోపదేశము గావించె. నేడు కోట్లకొలది వానరవీరులు విజృంభించి, మహాసము(ద్రమున శతయోజన పర్యంతము సేతువు నిర్మించి సువేలా పర్వతమున నిలచి మనలజెనక నున్నారు. అట్టి వారిని తేలికగా అంచనావేయరాదు. అదియు గాక ధర్మవిరుద్ధమైన పరదారాపహరణ మొనరించిన, మన కంటె ధర్మబలంబుతో నున్న వారి బలమధికముగాదా? 55

తే.గీ.:- ఇప్పుడైనను మించిన దేమిలేదు,
రామచం(ద్రుని కాతనిరమణినిచ్చి
శరణు వేడిన నాతడు కరుణ జూచు
శాంతి నెలకొల్పి నిల్పుమీ సంగరమ్ము ॥ 56

వచనము:- ఇదియునుగాక సీతాదేవిని చెరబట్టిన నాటినుండియు లంకలో ననేక అరిష్టంబులు బొడసూపుచున్నవి. గాన రామునితో లంకానాశనమును సూచించుచున్నది. మున్ను రామునకును మనకును వైరము లేదు. అతని పత్నిని బట్టి దెచ్చి మనమే వైరము గల్పించితిమి. మనమే సంధిజేసుకొనుట యుత్తమము. అని బల్కు అతికాయుని మాటలనాదరింపక రావణుడు శుకసారణులను నిరువురు రక్కసులజేరి, మీరు మాయవేషంబున (త్రికూటాచలమున కరిగి, అక్కడి సంగతులు దెలిసికొని వారి బలాబలంబుల గమనించి రావలయుననిజెప్పి పంపెను. వానరవేషములు దాల్చి యావానరులలో

గలసి లెక్కించనలవిగాని సైన్యమును జూచిరి. సుగ్రీవుని కడనున్న వానరులు యుద్ధములో తామేయేరక్కసులతో బోరవలయునో ఒక్కక్కరెంతమంది రక్కసుల పీచమండంచవలయునో, యెందరిని వంట్టుబెట్టవలయునోయని వంతులువైచుకొనుచుండిరి. అప్పుడంగదుని కడనునన్న వానరులు మావంతుకు వచ్చినరక్కసుల సంఖ్య తక్కువ అని బలుక, నల, నీల, గజ, గవయులుగూడ మావంతుకు ఇంకను పదివేల మందియుండ వలెను అని అందరును విభీషణుని జుట్టునుజేరి, అడుగుచు అప్పుడే రక్కసుల జంపుచున్నట్లావేశములతో మల్లచరుచుచు విజృంభించుచుండ శుకసారణులు భయభ్రాంతులైనక్కియుండిరి. వారిని జూచి విభీషణుడు మాయారక్కసులుగా గుర్తించి, వారిని రాముని యెదుట బెట్టి, దేవా! వీరు శుకసారణులను రక్కసులు రావణుని గూఢచారులు, మన బలాబలంబులు దెలిసికొనవచ్చిరన, వారును రాముని పాదముల బడి, అయ్యా! మమ్ము మన్నింపుడు రాజాజ్ఞ వలన మేము వచ్చిన మాట నిజమే తప్పు గలదని ప్రార్థించిరి. శ్రీరాముడు నవ్వుచు మీరు మీరాజు పంపిన వచ్చిన దూతలు. మీవంటి అల్పులను జంపనేల! మాబలముల జూచితిరి గదా! పోయి మీరాజునకు జెప్పుకొనుడు. మరియు నామాటలుగా మీరాజునకెరిగించుడు - 57

సీ:- మాయవేషము వైచి మారీచు బంపించి
మగవను గొంపోవ మగతనంబె,
పతి యింట లేనట్టి బడతుల దరిజేరి
పట్టి బంధించుట బంటుదనమె,
అశోకవనమున నతివను జెరబట్టి,
బలుగాకి గూతలు బలుక దగునె,
జానకి జూడగా జనుదెంచెనని నాదు
దూతను బంధింప దొరతనంబె ॥ 58

తే.గీ.:- చేవగలిగిన వీరుల జెనకవలయు,
సలుపవలయును నెదిరించి సంగరమ్ము,

బలము గలదేని రమ్మను బవరమునకు,
లంకతోడను నీరాజు పొంకమడతు ॥ 59

వచనము:- అని బలికి వారిని బొమ్మన, బ్రతుకు జీవుడా, అని వారులంకానగరమున కరిగి రావణునికి మ్రొక్కి, అచ్చటి వృత్తాంత మంతయు నివేదించి, అసంఖ్యామైన ఆ వానర సేన జూడ శక్యంబుగాదు. దేవా! మీరిప్పుడైనను, ఆ రామునితో సంధిజేసుకొనుటయే సేమమని బలుక, రావణుడు కోపించి, పగవారి పక్షమును బలుకు మిమ్ము బంపుటయే దప్పయ్యెను, బొండని కసరి, శార్దూలుండను రాక్షసుని బిలచి నీవు బోయి యారాముని సైన్యమును జూచిరమ్ము యీ శుక సారణుల మాటలు నమ్మ బనిలేదన, వాడును జని విభీషణుని వలన తనమాయా రూపము బయటబడ రామునకు మ్రొక్కి బ్రాణములు జేత బట్టి బరువెత్తి వచ్చిన, రావణుడు చేయునదిలేక, విద్యుజ్జిహ్వుని బిలచి, నీమాయోపాయమున రాముని శిరమును గల్పించి సీతను భయపెట్టుమన, వాడును రక్తము గారుచు కంఠము వరకునున్న రాముని శిరము సృష్టించి సీతముందుబెట్టిన. సీతయు గోలుగోలున నేడ్చుచు ఆ శిరమునొడియందిడుకొని, రామా! నన్ను వీడిపోతివే, నీ శిరంబును జూచినను నా ప్రాణములు బొందిని వీడకున్నవే! యని యేడ్చుచు ఎదుటనున్న రావణుని జూచి నారామునితో నన్నును దగ్ధము జేయుమని బ్రతిమాలుచున్న వైదేహితో, యిప్పుడైనను నీవారాముని మరచిపొమ్ము, నన్ను బొంది సుఖింపుమని బల్కిన సీత చెవులు మూసికొని, దుఃఖమునోపజాలక సొమ్మసిలినేలబడెను. రావణుడు బోయినవెనుక రాక్షసకాంతలు సీత నూరడించుచుండ నామాయా శిరము అదృశ్యమయ్యెను. అదిచూచి సీత రక్కసిమాయకు నాశ్చర్యము నొంది, రాముని సేమమును దలచి ధైర్యముతో నుండెను. రావణుడును మంత్రులబిలపించి యుద్ధసన్నాహము జేయుమన రావణుని మాతామహుడును మంత్రియునైన మాల్యవంతుడు రావణునికి రాజనీతిని దెలుపుచు - 60

కం:- తనబలము యెదిరి బలమును

గనుగొని నడుపంగవలయు కార్యము నెపుడున్
నను మన్నించియు నాయీ
మనవిని గైకొనుము లెమ్ము మాన్యతగనుమా 61

కం:- పగవారలల్లులనుచును
దగదు సుమా భావమందు దలపగ నీకున్,
మగువ కొఱకు నీ సర్వము
దగులంబెట్టంగ దగునె దనుజాధీశా! 62

కం:- సురలెప్పుడు ధర్మపరు, ల
సురులంగని వారినణచ జూచుదురెపుడున్,
సురబలము ధర్మబలమును
పరులందుననుండె నేడు పరికింపవొకో? 63

కం:- వ్యసనపరుండగు రాజును
గ్రసియింపగజూచుచుండు గడుదోషంబుల్,
రసహీనుని జేయును రా
క్షస వల్లభ వైరమడచి గాంచుము శుభముల్ || 64

తే.గీ.:- పద్మ సంభవు మెప్పును బడసి నీవు
భూరి వరములనెన్నియో పొందినావు.
అమర వరులైన గనలేని యట్టిదైన
భాగ్యనిలయంబు లంకచేబట్టినావు || 65

తే.గీ.:- వినుము నామాట నికనైన గనుము సుఖము
ధర్మమార్గంబులోజని దాశరధిని
శరణు వేడుము జెందుమా శాంతి నీవు
లంక గాపాడి రక్కసుల్ జంకు బాపు 66

తే.గీ.:- దుష్ట శకునంబులెన్నియో దోచుచుండె,
గానబడుచుండె లంకలో గాకులెన్నో
యంతిపురమందు గూబలే గంతులేసె
నక్కగూతలు వినబడె దిక్కులదర || 67

కం:- వానరుల దోడుగాగొని

దానవనాశంబుజేయ దశరధసుతుడై
యా నారాయణుడే జుమి
మానవ రూపంబుతోడ మహిలో బుట్టెన్ ॥ 68

కం:- లంకేశనాదు పల్కులు
శంకింపక వినుము బోయి శరణంబనుమా
పంకజనాభుడు నిన్నక
లంకుండై[బోచుసుమ్మి లంకాధీశా! 69

వచనము:- అని మాల్యవంతుడు నయవినయంబుల బోధించిన, రావణుడాతని మాటలులెక్కసేయక, యింకనానిశ్చయము మారదు. 70

కం:- జలనిధి గట్టిన నదియొక
బలమని యగ్గింపదగునె బగవారిని నా
బలమునెరుంగవె నేనా
జలజనయన సీత విడువ జగమెదురైనన్ ॥ 71

తే.గీ.:- మూడులోకంబులెదురైన ముగుద విడువ
నరుల నంపుదునంతకు బురమునకును
వాలములబట్టి యీడ్వనే వానరముల
లేడు జగమందు నాకెదురాడువాడు ॥ 72

వచనము:- అని కృత నిశ్చయుడై మంత్రులతో నాలోచించి యుద్ధమునకై దగునేర్పాటులుజేయించి, పట్టణము నలుమూలలా అసంఖ్య రక్షోవీరుల నుంచి కోటచుట్టును సాయుధులగు భటులగాపుంచి, ఇంద్రాదులెత్తి వచ్చినను జడవని నేనీ నరవానరులకా భయపడుట యని బలికి యంతిపురమునకు బోయెను. మరునాడు ప్రాతఃకాలముననే లేచి, తన సైన్యము యుద్ధమునకు సిద్ధముగా నేవిధముననున్నదో చూచుటకై సౌధోపరిభాగమున నిలచి రావణుడు దూరముగా సువేలా పర్వతముదిగి యుద్ధమునకై సిద్ధముగానున్న అసంఖ్య వానరసేనను జూచుచుండెను.

వానరసైనికులను జూచి విభీషణుడు ఏవి రాక్షసవీరులతో నేయే వానరవీరులు సరిపోవుదు ఎంచి నియమించుచుండెను.

నాలుగు దిశల నిలచిన రాక్షసవీరుల జూపి -

తే.గీ.:- తూర్పు దిశయందు గాచెనా దుష్టబుద్ధి
అతడె ప్రధమసేనాని ప్రహస్తుడనగ
వాని జెనకంగ జాలిన వాడు వీరు
డంగదుడెజాలు నికనందియంబు లేదు ||

తే.గీ.:- మేఘనాధుండు, జూడన మేయబలుడు,
వానినెదిరింప గలగిన వాడె హనుమ,
పశ్చిమద్వారమందుగా పరియతండె
యుత్తరంబున రావణుడుండె గనుడి ||

కం:- రావణునెదిరించంగా
నే వారును జాలకుందు రినకులతిలుకా
గావున నీవే నిలువుము
నీ వెనుకను లక్ష్మణుండు నేనును నిలువన్ ||

వచనము:- అనిన విభీషణుని వాక్యంబులకు, రాముడెయ్యకొని
సెలవిచ్చి యొకపరి లంకాపట్టణంబు దెస బరికించి జూ
నుండి గానవచ్చు దశకంఠుని జూచెను. అతడే రావ
రామునకుజూపి సుగ్రీవుడు ఆవేశమును బట్టజాలక -

తే.గీ.:- ఒక్కయురుకున నెగిరెనా దిక్కునకును
నుక్కువలెనున్న రావణు నుక్కడింప
వాని చుకుటంబునెగురగా వచ్చి దన్నె
నతని దుస్సాహసంబున కదరి పడుచు ||

కం:- దశకంఠుడు క్రోధంబున
బశుబలమున వచ్చినట్టి వానరుగనిక
ర్కశముగ బట్టుకు బాదెను
దిశలెల్ల గలంగ నపుడె దినకర తనయున్ ||

కం:- కరి కరి దాకిన విధమున
హరిహరి పైబడిన యుట్టు లార్పుచు మిగులన్,
సురవైరితోడనా వా

నరుడుద్ధండతనుదాకె నాగమువోలెన్ ॥ 80

కం:- తట్టుచు నేలను నిరువురు
బెట్టుగ తమమల్ల జరిచి భీకరులగుచున్
బిట్టుగ నార్చుచు నొండొరు
లట్టేగవయంగయడలి రందరు గూడన్ ॥ 81

వచనము:- మదగజంబుల వలెను, కొదమసింగములట్లును, బెనుగొండల బోలె సింహగర్జనంబులతో వారిరువురును బోరుచుండ, నెవ్వరును వారిదరి జేరలేక పోయిరి. అట్లు కొంతతడవు మల్లయుద్ధము జేసి యిరువురును నిలచిరి. అది గమనించి రాక్షసవీరులు పదువురొక్కసారి సుగ్రీవుని పైబడి వానిని బట్టుకొనిరి. సుగ్రీవుడును భీమబలంబున వారలనొక్కసారి విదలించి సువేలా పర్వతముపైకెగిరిపోయెను. అప్పుడు రాముడు వానినెత్తియొడలు దుడిచి గౌగలించుకొని వాని శ్రమ నివారించుచు - మిత్రమా! ఏమి నీ సాహసము శత్రువుల కడకు వంటరిగా బోదగునా? అక్కడ నీకేదైన ప్రమాదము సంభవించిన యెంతటి నగుబాటు అని మందలించెను. 82

## అంగద రాయబారము

శ్రీ రాముని అనుజ్ఞతో సుగ్రీవ విభీషణులు సైన్యము నాయత్తము జేసిరి. నీలునకు మైందవ, ద్వివిదులను కొంతమందిని నిచ్చి నీ సైన్యముతో నీవు తూర్పు దిశను ముట్టడించుమని జెప్పి, అంగదునికి గజ, గవయ, గంధ, మాదనులను మరి కొంతమంది వానరవీరులనిచ్చి నీవు దక్షిణదిశను ముట్టడించుమని జెప్పి, అంజనేయునకు ప్రమాది, ప్రజంఘులను అనేక కపివీరులతో నిచ్చి నీవుత్తరదిశగా జని ముట్టడించుమని జెప్పి రామలక్ష్మణులతో సుగ్రీవుడును, జాంబవంతుడును, విభీషణుడునుండ నిశ్చయించిరి. ఆసమయంబున రాజనీతి విశారదుడును, శాంతి కాముడును నగురాముడు విభీషణునితో నాలోచించి అంగదుని బిలచి, మనము శాంతియుతముగా కార్యము

చక్కబెట్టవలయు గనుక మనము సంధి జేసుకొనుటకే ప్రయత్నించవలయు నీవు రావణు నొద్దకు బోనావచనములుగా జెప్పుము.

తే.గీ.:- ప్రాణములయాశగలదేని పడతి విడచి,
తప్పు జేసితినని నీవు జెప్ప బ్రతుకు,
మఱుల గాదేని నిన్నిదే హతముజేతు,
నేలు నీలంక నీతమ్ము డిది నిజమ్ము ॥ 83

కం:- ధర్మము దప్పిన వారే
కర్మను జేసినను నిలువగలరే యింకన్
ధర్మేతరులకు దుష్కర
కర్మఫలంబనుభవింప గలుగును భువిలో ॥ 84

వచనము:- రాముని సందేశంబును రావణుని కెరిగింప అంగదుడు రావణు నాస్థానమండపము బ్రవేశించి, సింహాసనాశీనుడగు రావణునెదుట నిలచి రాముని వాక్యములు దెలిపి, ఓదనుజేంద్రా నీవా రామునెదుర్కొనజాలవు. సీతామాతను రామున కప్పగించి యాతని శరణు బొందుము. యాతడు నిన్ను కరుణించును. నీవు నీ పుత్ర, మిత్ర, కళత్రాదులతో సుఖంబుననుండుము, అని నచ్చజెప్పి 85

కం:- ఇప్పటికైనను నీయీ
తప్పునుగమనించి శాంతి దనరగ నిటుపై
ముప్పును దొలగంజేయుము
నిప్పుడమి సుఖంబు జెందనేలుము దొర్వై ॥ 86

వచనము:- అని బల్కు నంగదుని జూచి రావవణుడు మండిపడి, వెంటనే వీనిని బట్టి వధింపుడని తనసైనికులకానతిచ్చిన, వారును గద, శూల, పట్టిసంబులతో అంగదుని బొడిచిరి. అంగదుడు వారలను తన వాలమున చుట్టబెట్టి ఆకసముపైకెగిరి అటనుండి వారి మస్తకములు జిదుక క్రిందకు విసరి గొట్టిన వారు రక్తము గ్రక్కుచు రావణు పాదములచెంత బడిరి. రావణుడాశ్చర్యమున జూడ రాముని వద్దకు నెగిరిపోయెను. ఆచచ్చిన వారిలో ఖరునికుమారుడు సుకరుడను

వీరుడు గూడనుండె. ఆరాక్షసవీరుని మరణమునకు జింతించి, రావణుడు వెంటనే తన మూలబలంబుల నాయత్తబరచి, తెల్లవారిన తోడనే యుద్ధమారంభము జేయుమని, యేయేవీరుడేయే వానరునెదుర్కొన వలయునో మంత్రులతో నాలోచించి సమర సన్నద్ధడాయెను. అంగదుడును రావణుని సంగతి జెప్పి సమరమునకానతిమ్ము 87

తే.గీ.:- ఇంకయోచనమదియేల యినకులేంద్ర
నీతికిని ధర్మమునకును నీవెసాటి
రావణుని చక్కదిద్దుట రాదుమనకు
చెవిటి వానికి శంఖూది చెప్పినట్లె || 88

వచనము:- కానున్నది కాక మానదు రేపే యుద్ధము జరుగ వలసియున్నది. మనవానరవీరుల యుత్సాహము నాపజాలము అని విన్నవించెను. మరునాడు తెల్లవారిన తోడనే లంకానగరమున యుద్ధభేరులు మ్రోగెను. 89

## వానర రాక్షసుల యుద్ధము

వచనము:- రాక్షసవీరులు గద, పట్టిస, శూల, ముద్గలములంబట్టి నిలువ, రథ, గజ, తురగారూఢులగు వీరులు ముందునకురికిరి, విభీషణుని సూచనలననుసరించి వానరవీరులేయే రక్కసులనెదుర్కొనవలయునో యాయా విధముగా కయ్యమునకెదురు నిలచిరి. ఇంద్రజిత్తుని నెదుర్కొన అంగదుడును, ప్రజంఘునుని సంపాతియు, జంబుమాలిని హనుమంతుడును, మిత్రఘ్నుని విభీషణుడును, తపనుని నలుడును, నికుంభుని నీలుడును, ప్రహస్తుని సుగ్రీవుడును, విరూపాక్షుని లక్ష్మణుడును, రశ్మికేతు, అగ్నికేతు, యజ్ఞకేతు, సుప్తఘ్నులను శ్రీరాముడును, వజ్రముష్టిని మైందుడును, అశనిప్రభుని ద్వివిదుడును, ప్రతపుని గజుడును, మహోదరుని సుషేణుడును, మకరాక్షుని జాంబవంతుడును, కుంభుని ధూమ్రుడును, నరాంతకుని పనసుడును,

దేవాంతకుని గవాక్షుడును, త్రిశరుని శరభుడును,ధూమ్రాక్షుని కేసరియును, విద్యుజ్జిహ్వుని గంధమాదనుడును, మహాపార్శ్వుని శతబలియు దలపడ సిద్ధమయ్యెరి. ఇట్లు సమాన బలవీరుల నెన్నుకొని వానరులు తరు పాషాణముల బట్టి నిలువ వానర రాక్షస మహాసంకులము ప్రారంభమయ్యెను. 90

తే.గీ.:- ఇంద్రజిత్తుండు నంగదునెదురుకొనియె
గదనుగైకొని మోద నాగదనుబట్టి
విసరి వాని రథంబునే విరుగ గొట్టె,
పడెను సంపాతి పైన ప్రభంజనుండు. 91

తే.గీ.:- చితుకగొట్టి ప్రభంజను జిత్తుజేసి
యొక్క తరుబట్టి సంపాతియురికె వేగ,
జంబుమాలిని రథముతో జరిచి మోది
నాంజనేయుండు నాతని నణచివైచె || 92

తే.గీ.:- అప్రహస్తుని పైబడి నతనిబట్టి
జితుకగొట్టెను సుగ్రీవు డతుల శక్తి
నగ్నికేతుని సుప్తఘ్ను యజ్ఞకోపు
లనెడి నల్వుర జంపె నయ్యవనిపతియు || 93

కం:- శరజాలంబులతోడను
విరుపాక్షుని లక్ష్మణుండు వేసటబరచెన్.
దురమున మైందుడు దానొక
దరుచేనా యశనిపాతు దనువునమోదెన్ || 94

వచనము:- సుగ్రీవుడా మహోదరుని పైనొకగండశిలవైచి మస్తకము జితుక గొట్టెను. మకరాక్షుడు యుద్ధభూమిని వీడి పరుగెత్తునటుల జాంబవంతుడుతరివెను. నొకకొండ శిఖరవుుతో ధూమ్రుడుకుంభినియను రక్కసుని నుక్కడించెను. ప్రతపనుడు శూలముతో గజుని బొడువ, నాగజుడు హింతాల వృక్షము బెరికిదెచ్చి వానిని జావమోదెను. ఇట్లు 95

కం:- వానర లుద్దండు లగుచు
దానవ వీరులను బట్టి దరువుల చేతన్

ఖూనికతో గిరులెత్తభి
మానము దొలగంగ జేసి మర్ధించిరొగిన్ ॥ 96

తే.గీ:- దానవులతోడబోరెడి వానరముల
జూడజాలక నరిగెనో సూర్యుడనగ
దినము గతియించి వెలుగుల తేజమడగె
నంధకారమ్ము వ్యాపించె నన్నిదిశల ॥ 97

తే.గీ:- శత్రులెవ్వరో తమతమ మిత్రులెవరో
తెలియజాలక యోధులు దిక్కజెంద
కనకభూషణ వసనముల్ గాంతులీన
వారె రక్కసులనియెంచె వానరములు ॥ 98

కం:- హనుమంతు జేత నొచ్చియు
జనియెను నాయింద్రజిత్తు జనకుని కడకున్.
దనయునితో జర్చించెను
ననిలో వానరుల నెట్లు నణచగ వలెనో! ॥ 99

## ఇంద్రజిత్తునిమాయాయుద్ధము:-

వచనము:- మరునాడింద్రజిత్తుడు రక్తమాల్యాంబరములుధరించి, హోమశాలకు జని, దానవగురూపదిష్టంబగు సధ్వరణ తంత్రంబొనర్చినొక దివ్యరథంబును బొంది మహాపరాక్రమముతో యుద్ధభూమిని ప్రవేశించి శత్రుభయంకరుడై యుద్ధమొనర్చెను. తనదివ్య రధముతో నంతరిక్షమున నెగురుచు శరపరంపరలగురియించెను. వానియుద్ధనైపుణ్యమును జూచి, రామలక్ష్మణులు చకితులయిరి. తన మాయా విద్యాబలమున, మేఘములోదాగి యుద్ధమొనర్ప రామలక్ష్మణులుతమ శరములతో వాని వెదుర్కొన దొడగిరి. గాని సార్ధకనామధేయుండగు మేఘనాధుడితరుల కదృశ్యమానుండై యుద్ధముజేయ, వాని మాయాజాలమును ఛేదింపజాలక లక్ష్మణుడన్నతో నీమాయాదానవుని

జంప బ్రహ్మాస్త్రంబు బ్రయోగింపక దప్పదు. గాన నాబ్రహ్మాస్త్రంబున వానింబరి మార్చుమన రాముడు బ్రహ్మాస్త్రప్రయోగము జేయ సంకల్పించిన సమయముననే ఇంద్రజిత్తు నాగపాశంబను నొక మహాస్త్రంబు బ్రయోగింప నది భయంకర సర్పంబులతో భండ భూమినంతయు గప్పి రామ లక్ష్మణులను పాశ బద్ధులను జేసెను. ఆ సర్పంబులచే జుట్టబడి వానరులు మూర్ఛనొందిరి. రాముడది జూచి యు కర్మబంధవము దప్పదనునట్లా నర్పంబులచే బంధింపబడియుండెను. వానరులు గోలున నేడ్వ విభీషణుడు వారలనోదార్చి, కొంత తడవున కాపాశముల నుండి విముక్తులు కాగలరని , భయమంద వలదని తెలియజేసెను. రామలక్ష్మణులు మరణించిరని యింద్రజిత్తు విజయగర్వంబున లంకకేతించెను. రావణుడు త్రిజటను బిలచి, మన ఇంద్రజిత్తుచే రామలక్ష్మణులు మరణించిరి,గాన సీతకావిషయముజెప్పి రామునిపై యాశవీడి నన్ను జేపట్టుమని నచ్చజెప్పుమని బంపెను. త్రిజటయు రామలక్ష్మణుల వృత్తాంతముజెప్ప సీత గోలుగోలున నేడ్చుచుండ త్రిజట ఆమెనోదార్చి, తన మాయాశక్తితో ఆకాశగమనమ్మున సీతను దీనుకొని పోయి యుద్ధరంగములో నాగపాశ బద్ధులైయున్న రామలక్ష్మణులను జూపెను. వారిని జూచి యేడ్చుచున్న సీతనోదార్చి, దేవీ! వారు అస్త్రబద్ధులైరిగాని మరణించలేదు. నా మాటనమ్ముము. 100

తే.గీ:- నరుడుగాడు వినుము నలినాక్షి రాము
డా హరియెయని మాపెద్ద లనగ వింటి
నరుల చేత గాని నసుర నాధునకును
మరణమేలేదని హరియె మనుజుడయ్యె ॥ 101

తే.గీ.:- రావణుని జంపి రాముడు రాగలండు
నిన్ను గొంపోవు నింకేల నీవు భయము
జింత వీడు మయ్యోధ్యకు జేరగలరు
రాజసుఖముల నందంగ రమణి నిజము ॥ 102

వచనము.:- అని ధైర్యము జెప్పుచు సీతనూరడించి తిరిగి యశోకవనమునకు

గొంపోయెను. అచ్చట నాగపాశబద్ధులైయున్న రామలక్ష్మణులకడకు
బ్రహ్మమానసపుత్రుడగు 103

ఆ.వె.:-నారదుండు వచ్చి నారాయణా నీవు
నాగ పాశమునకు నలిగి పోతె
నీకు దగునటయ్య నీవు నరుండవె
మరచి నావె విష్ణు మహిమలన్ని? 104

ఆ.వె.:-ఆదివిష్ణు వీవు యదినెరుంగగలేక
జిక్కినావు శత్రు జేతనీవు
మరచి యుంటివన్ని మనుజడ ననుకొని
తెమ్ముమాయ దెలసి కొమ్ము వేగ ॥ 105

కం.:- అనిన విని రామ చంద్రుడు
కనుగొని నిజమరసి బిలచె గరుడుని, నతడున్
ఘనమగునహి పాశంబులు
వినయంబున ద్రెంచి ప్రభుని విడిపించెదగన్ ॥ 106

వచనము.:- గరుత్మంతుని వలన ఆనాగముల న్నియునశించెను. వానరులు నిద్రనుండి మేల్కొనునటుల లేచిరి. రాముడును గరుత్మంతుని మన్నించెను. అందురును సంతోషించిరి. గరుత్మంతుడు తిరిగి తన స్థావరమున కేగెను. రామలక్ష్మణులు బంధవిముక్తులై తిరిగి వానరులతో యుద్ధమునకు సిద్ధముగా నిలచిరని రాక్షసులవలన విని మేఘనాధుడు క్రోధంబున మండి పడి తాను యుద్ధమునకు బయలు దేరుచు ముందుగా తనమంత్రులగు ధూమ్రాక్షుని, అకంపనుని, మహాకాయుని నరాంతక, దేవాంతకక, అతి కాయులు మొదలగు వీరులంసైన్యసమేతముగా ముందు బంపిన, వారును రణరంగంబున ప్రవేశించి అఖండ తేజోవిరాజులై వానరులపై అస్త్రిజాలములగుప్పించిరి. రామలక్ష్మణులు వారిపై అనేక మహాస్త్రింబుల నేసిరి. వాయునందనుడు ధూమ్రాక్ష అకంపనుల నొకదారుచే మడియించెను. అంగదుడు మహాకాయుని జంపి సింహనాదంబు జేసెను. ప్రహస్తుడను రాక్షస వీరుడు మహాబలమ్ముతో

ముందున కురికి వానరుల మర్ధింప దొడంగెను. నీలుడను వానరుడా ప్రహస్తుని జంపెను. 107

## రావణునికి మండోదరి నీతిగరపుట

మహావీరులగు ధూమ్రాక్ష, అకంపన, మహాకాయ ప్రహస్తుల మరణమునకు రావణుడు చింతించి.

తే.గీ.:- ఏమి మాయయో నింతయు నెరుగరాదు
అట్టి వీరుల జెనకంగ నెట్టి వారొ
ఎట్లు వచ్చెను వీరల కింతబలము
నిదియె గాబోలు విధియన నెంత వింత ॥ 108

వచనము.:- అని తానే యుద్ధభూమి కరిగెదనని నిశ్చయించెను. అది తెలసి మండోదరి భర్త చెంత కేతెంచి నయవినయంబుల బోధింప సాగెను. 109

సీ.:- దనుజనాయకుడవు ధర్మమూర్తివి నీవు
నీకు జెప్పంగనే నెంత దాన,
పరమేష్ఠి చేబలు వరములు బొందియా
పరమేశు మెప్పించి బరగినావు
కైలాస శైలంబు గదలించి నీశక్తి
భక్తితోడను జూపి భళియనంగ
నీశక్తి శంకించె నేనుబలుక లేదు
ధర్మపథమువీడ ధర్మమగునె ! 110

తే.గీ.:- పరసతిని బట్టి జెల్లునే భక్తులకును
యెందు బోయెను నీ ధర్మ మేది నీతి
దెలిసి యుండి యధర్మంబు జేయనేల
ధర్మదూరుడు బొందునే ధర్మకీర్తి ॥ 111

కం.:- వాలంబు కలసి రానపు
డేలా విజయంబు గల్గు నెరుగవె నీవే

చాలగ యోచించుము నీ
మేలును బరికించి ప్రజల మేలునుగనవే ॥ 112

కం.:- లెమ్మిప్పుడైన రాముని
కిమ్మా జానకుని దెచ్చి యీప్సితమొదవన్,
మమ్ములజూడుము దయతో
నిమ్మహిలో కీర్తిబొంది యేలుము ప్రజలన్ ॥ 113

వచనము.:- శ్రీరాముని సామాన్యమావునిగా దలంచరాదు. ఖరదూషణ త్రిశిరుల జంపినమేటి. మహాబలశాలి యైన వాలిని జంపిన పరాక్రమవంతుడు. తండ్రియానతిని తమ్ముని తోడను జానకి తోడను వనములందిరుగుచు దుష్టశిక్షణ శిష్టరక్షణ జేయుచున్నాడు. అతని భార్యనపహరించినీవతనికి శత్రువైతివి. తనుజుల బరిమార్చునతనికి సురల సహాయముగల ధర్మపక్షమున విజయముండుటెరుంగవా? శ్రీరాముని జయించుట నా శక్తికిమించినపని. నీవధర్మపక్షమున నుండి ధర్మనాశనము జేయుటనుచితము. నీ సాహసమువలన ధూమ్రాక్ష, అకంపన, మహాకాయుల వంటి వీరులంబోగొట్టు కొంటివి. యిప్పుడైనను సంధిచే కార్యవుంచక్క బరుచు కొనుము. నరవానరులల్పులని భావించక, రాముని శరణుబొంది రాక్షసకులమునకు గలిగిన యీ ముప్పును దప్పింపుము. ఆనాడు కార్తవీర్యార్జునునితో సంధి జేసుకొని శుభంబులం బొందితివి గదా! నేడా కార్తవీర్యునే జయించిన పరశురామునిపై విజయము సాధించిన జగజెట్టియైన రాముని వంటి మహావీరునితో సంధి జేసుకునుటకేల సంకోచించుచుంటివి? రాముడు శరణాగత రక్షకుడు, నీవు శరణన్న నీతప్పుమన్నించి నిన్ను మిత్రునిగా ఆదరించి గౌరవించును. గాన నీమనమున నెట్టి సందేహంబును నుంచక రాముని శరణు బొందుమని బల్కిన- ప్రియపత్ని వాక్యంబులు విని రావణుడు దేవీ! నీవాక్యములు సముచితమే, గాని సురాసురులనే జయించిన నేను నేడీ నరాధముల శరణు జొచ్చిన, లోకులు నవ్వరే? అష్టదిక్పతులనే అరికట్టి, నేడు నరవానరులముందు శిరసువంచగలనే? ఏమైనను యుద్ధము తప్పదు.

జయాపజయంబులు దైవాధీనములు. ముల్లోకములు జయించిన రాక్షసేశ్వరుని ధర్మపత్నివై, ఇంద్రజిత్తువంటి కొమరుని గన్న వీరమాతవై యిట్టి పిరికి మాటలాడ దగునే. నేనే ఆనరవానరములజంపగలను భయము దక్కియుండుము. అని యుద్ధభూమి కరిగెను. చండ ప్రచండుడై, పరాక్రమము మెరయ వానరవీరుల నెదుర్కొనెను. ఒండొరులు తమ శక్తి సామర్థ్యంబులు మెరయ యుద్ధమొనరించిరి. రావణలక్ష్మణులు ద్వంధయుద్ధము జేయ, రావణు ధాటికి తాళజాలక సొమ్మసిలిబడెను. పడిన లక్ష్మణునెత్తితన రథముపైనిడి బోవుటకుద్యుక్తుడయ్యెను. హనుమంతుడు రావణు నెదిరించి లక్ష్మణుని తన భుజంబులనిడి రాముని వద్దకు జేర్చెను. లక్ష్మణుడు తెలివొంది రావణుని గదిసెను. శ్రీరాముడు తమ్ముని వారించి తానే రావణునెదుర్కొనెను. ఇరువురును కొంత తడవు ఘోరముగాపోరిరి. రావణుడలసి పోయెను. రాముడు నవ్వుచు, వానరులతో పోరి అలసిపోయితివి. నీపైబాణము వేయదగదు. నేడు బోయి రేపు రమ్ము అని వానిని విడచి పెట్టెను. రావణుడు రథమును మళ్లించుకొని నగరమున కేగెను. వైరి బలంబును గమనించి- 114

తే.గీ.:- పద్మజుని చేతబడసిన వరములెల్ల
నేడు నేమయ్యె, రాముని నేను గవయ
నష్టదిక్పతులందర నణచి నట్టి
శస్త్రులేమయ్యెనాబాణ శస్త్రిమేది ॥ 115

తే.గీ.:- నరుల యందున నిట్టి వానరులయందు,
నాశమయ్యెననాశక్తి నాదు బలము
యిట్టి నరవానరములజంప దిట్టమైన
కుంభకర్ణుండు గలడింక గొరతయేల ॥ 116

వచనము.:- అని చింతించి ఉద్దండులగు నావానరుల సమయింపదగిన వాడా కుంభకర్ణుడే. కాన వానిని మేల్కొలుపుడని, యూపాక్షుడు, మహోదరుడు మొదలగు రక్కస వీరులంబంప, వారును, దశశకటంబులనిండుగానన్నమును, దానికి దగిన రసవర్గంబులు,

పదిబండ్లపై నింపి, మాంసముతో నింపిన కడవులు బండ్లపైనుంచి, పదియెను పోతులును, రెండు వందల గొఱ్ఱెలను, వేయిపందులును, మధువు నింపిన పీపాలను బండ్లపైనెత్తించి ముప్పది బండ్లపై వేయించి ఇరువది యొక్కమంది మానవులనునరమాంసమున కైదోలు కొని కుంభకర్ణుని, శయనాగారమును జొచ్చి, వానిని మేల్కొలు పదొడంగిరి. 117

తే.గీ.:- యోజనత్రయనితతమై యున్నయట్టి
దీర్ఘచతురస్రమైనయా దీపగృహము,
నందు శయనించి యున్నట్టి యమిత బలుని,
ఘోరకాయుని జూచిరా కుంభకర్ణు ॥ 118

తే.గీ.:- గుఱ్ఱుబెట్టుచు నిద్రించు గుంభకర్ణు
నాసికారంధ్రముల జొచ్చి గాసిజెంది
యతని యుచ్ఛ్వాసనిశ్వాస మందునున్న
వాయువేగములోని కీవలకు నీడ్వ ॥ 119

తే.గీ.:- వదన గహ్వారమున బడి వరల లేక
పరుగులెత్తిరి రక్కసుల్ దూరమునకు
నిచ్చనలనెక్కి వానిని నిదుర లేప
యతని తలదిక్కు జేరిరా యసురులంత ॥ 120

కం.:- శూలముల బట్టి భుజముల
వీలుగకర్ణముల గ్రుచ్చి వేసారి హరా!
ఏలీల వీని గదవన్
జాలుదుమని వారు మిగుల సతమతమగుచున్ ॥ 121

సీ.:- పర్వతంబన జెల్లు బహుపెద్ద శయ్యపై
నిద్రించుచుండె నానిసిచరుండు
వీనికెవ్విధమున వినిపింప వలెమన
రాజాజ్ఞ యనుచును రాజభటులు
మదగజంబులు దెచ్చిమట్టించి మరి మరీ

సీసంబు గరిగించి జెవుల బోసి,
భేరీలు మ్రోయించి భీకరంబుననార్చి
శూలంబుల బట్టి జొనిపి జొనిపి. 122

తే.గీ.:- గోల జేయుచు వానిని గుంజిగుంజి,
గట్టిగా మోదసాగిరి పొట్టపైన
యొడలు విరుచుకునాతడు యొత్తిగిల్లి
వినుగు జనియింప కన్నులు విప్పి జూచె || 123

ఆ.వె.:-కనులు దెరచి జూడ, కళవళ పడివారు
భక్తితోడ మ్రొక్కి భయముగదుర
దనుజనాధునాజ్ఞ, దయసేయుడని బల్కి
వేగిరించిరతని వినయముననను || 124

వచనము.:- రక్కసులు కుంభకర్ణునకు నమస్కరించి విధేయులై రాజాజ్ఞ నెరిగింప- 125

ఆ.వె.:-ఏమివచ్చెమనకు నేయాపదలు గల్గె
నీమమెల్లజెరచి నేడు నన్ను
యేలలేపిరిట్లు నీసమయంబున
దెలుపుడంతనాకు దెల్లముగను || 126

వచనము.:- అని దన్ను లేపన దానవులనడుగవారును, అయ్యా! యేమి జెప్పుదుము. ఇద్దరు నరులు వానరులను దోడుగా జేసికొని నముద్రమును దాటి, మనలంకనుముట్టడించిరి. అరివీర భయంకరులగు మన రక్కసుల నుక్కడించిరి. అందువలన రాక్షసేశ్వరుడు వారలను జంపుటకుగాను మిమ్ముమేల్కొలుపమమ్ముబుత్తెంచెనన- 126

కం.:- ఆనరుల బట్టియిప్పుడె
వానరములతోడ జుట్టి వారిధి లోనన్,
నేనీనాడే ముంచెద
దానవ నాధుండుమెచ్చి దగుదగుననగా || 128

కం.:- ముందుగ యాకలిగొనియు



న్నందున నాభోజనంబునమరింపుడు నా
కిందున ననగానే వా
రందరునటదెచ్చిబోసిరన్నపురాశుల్ 129

వచనము.:- కుంభకర్ణుండటనుండి గదలి [illegible] యా ఆహారపదార్ధంబులన్నియు దిని, మధువును ద్రావి. అన్నగారిని దర్శింపనేగెను. అతడు వీధిని బడినడచుచుండ నొకమహాభూతంబువలె చూపరులకు భయమును గలిగించెను. గగనోన్నతంబైన శరీరముగలిగిన కుంభకర్ణుడు దూరంబుగానున్న యుద్ధ భూమిని జూచెను. ఆరణస్థలమంతయు వాని ఛాయచేగప్పబడియె. నదిచూచి రాముడాశ్చరంబున యిదియేమి! ఈ మహాభూతమెందుండి వచ్చెనని అడుగ విభీషణుడు రామచంద్రా! అది భూతముగాదు. మా అన్నయగు కుంభకర్ణుడు. అసమానబలపరాక్రమముగల వాడు వీనికీ బలము జన్మజాతంబై వచ్చెను. ఇతడారు నెలలు నిద్రలోనుండి ఒక్క రోజు మాత్రము జాగ్రదావస్థయందుండును. ఆరోజున వీనిని జయింప హరి హరాదులకైనను వశము [illegible] అని రామున కాతని విషయము జెప్ప దొడంగె. 130

## కుంభకర్ణుని గురించి విభీషణుడు రామునకు జెప్పుట

కుంభకర్ణుడు పుట్టువు తోడనే భీకరమైన శరీనమును, విపరీతమైన బలముతోడను జన్మించెను. వీని పరాక్రమమును, బలమును సహజాతములే గాని వరలబ్ధములు గావు.

కం.:- పుట్టిన దాదిగ జీవుల
బట్టియు మ్రింగుచునుండ బలరిపుడతనిన్
బట్టివధింపగవచ్చిన
దట్టుచు నాతని గజంబు దంతము విరచెను.॥ 131

కం.:- వానవుడడలుచువేగమె
గాసిలి పరువిడెను బ్రహ్మీకడకున్నవుడే,
వానవుభయమును బాపుచు
నాసత్యనివాని శాపమవుడేనిచ్చెన్ ॥ 132

కం.:- దానవ నీవికమీదను
బూనియెపుడు నిద్రయందె బుచ్చుముదినముల్
యీనీభీకరరూపము
గానగలేరనగప్రజల కంటను బ్రదకన్ ॥ 133

కం.:- అదివిని దానవనాధుడు
మదిలోనంజింతజెంది మరిమరివేడెన్,
ఇదియేమీ? తాతా? యా
నిదురందున వీని నణచనీకుండగునే 134

కం.:- అనవిని విధియిటులనియెన్
గనుగొమ్మిక నారునెలలు కాలముకొకటే
దినమున దెలివొంది వడిన్
దినునాహారమ్ముమరలదెలివిని దప్పున్ ॥ 135

కం.:- ఆరునెలల నాడీతని
జేరగ వెరచెదరు వీని జెంతకునెవరున్
ఘోరబలమబ్బువీనికి
పోరగలేరట్టితరిని పుడమి నెవండున్ ॥ 136

వచనము.:- అనిజెప్పిన విధాతమాటలు విని రావణుడు కుంభకర్ణుని నగరికి దూరముగా శయ్యాగారమేర్పరచి శయనింపజేసెను. ఆరునెలలు గడచిన తదుపరినొక్కదినమున మేల్కొని యారునెలలకు సరిపడు నాహారంబును దిని అమేయబలవంతుడగును. వీనినెవ్వరును జయింపజాలరు. గాని ఇది వీనికి జాగరదినముగాదు గాన వీడెంత బలవంతుడయ్యు ననుకూలకాలముగానందున నేడు మీచేత జచ్చుట నిజంబు. అని రామునకు నివేదించెను. 137

# కుంభకర్ణుని యుద్ధము

కుంభకర్ణుడు రావణుని సభాభవనము జేరి యన్నకు నమస్కరించిన, రావణుడాతనికి దశరథ నందనుల జరిత్రనెరిగించి, ఆనరవానరులల్పులనుకొంటిని, గాని వారుద్దండులై, మనప్రహస్తుని, జంబుమాలిని మొదలగువీరులంజంపిరి. గాన వారల సమయింపజాలిన వాడవు నీవేనని నిన్ను మేల్కొలిపితిమన, కుంభకర్ణుడును, నొక్కింతయాలోచించి నేనుముందుగానే నీకు జెప్పితి. పరదారాపహరణము పాపహేతువు గదా! దీని వలన నింతయ్యెను. అజేయమగు మనలంకకు నరవానరులరుదెంచి భీభత్సము జేసిరన వారలెంతబలవంతులో గమనించుము. రాజులకు ధర్మార్థ కామంబులర్థమైనవి. అందు ధర్మవిరుద్ధమైన అర్థకామంబుల బొందజూచుట అవివేకము. నీవధర్మమార్గంబున కామముబొందదలచితివి. ఇది నీకు సాధ్యంబుగాదు. లంకకు గలిగిన యీ ముప్పును గమనించి సీతాదేవిని శ్రీరామునకిచ్చి శరణు బొంది సుఖింపుమన రావణుడు కోపించి యింత వరకును వచ్చిన పిదప యుద్ధమునకు వెరుతునా? నీవు యుద్ధము చేయజాలవేని బోయి పరుండుము నేనే యుద్ధమునకేగెదనని లేచిన కుంభకర్ణుడు-

కం.:- నేనుండగనీకేలను
నేనేయుద్ధంబుజేతు నీవుండుమిటన్,
మానవులనగానెంతటి
వానరులనగానదెంత వారలజెనకన్ ॥ 138

వచనము:- తమ్ముని మాటలకు రావణుడు సంతసించి వానికి గావలసిన కవచాదులనిచ్చి దీవించి పంపిన, సేనాసమేతుడై యుద్ధభూమిని బ్రవేశించి ప్రళయకాలరుద్రుని వలె బిట్టుగానార్చిన కుంభకర్ణుని యాకారంబునకును వాని బొబ్బలకును వానరులు భయకంపితులైరి రాముని వెనుకకు బరువెత్తిరి. 139

తే.గీ.:- ఘోరకాయంబుతో వచ్చు గుంభకర్ణు
జూచి వానరులందరు జోద్యమంది
యెద్దియోభూతమిదియని యెల్లవారు
భయముచేరామునొద్దకు బరుగులిడిరి ॥ 140

కం.:- వారల భయముందీర్పగ
ధీరుడు సౌమిత్రి యేగె తేజముతోడన్
జేరువ వచ్చెడి లక్ష్మణు
నా రాముని కడకు వినరె నందరునడలన్॥ 141

వచనము.:- అంత సుగ్రీవుడు కుంభకర్ణునిపై బండలతో మోదియు, తరువులచే నొప్పించియు, యుద్ధమొనర్ప కుంభకర్ణుడు వానిని మూపు పైనిడు కొనిలంకాపురాభిముఖుడై జనుచుండెను. వానరులు భయాక్రాంతులై నేడ్చుచుండ నా సుగ్రీవుడు కుంభకర్ణుని మూపుపైనుండి వాని కర్ణంబులును నాసికను గొరికివాని పట్టునుండి విడిపించుకొని యెగిరి పోయెను. అంత కుంభకర్ణుడు కర్ణ నాసికంబులు గొరక బడి రక్తము గారుచుండ నొక్కింతవిచారించి 142

తే.గీ.:- కాని సమయంబు మాకిది గనుకనిట్లు
విధియె మమ్మిట్లు వంచించె వింతయయ్యె
నాదు సోదరినే గాదు నన్ను గూడ
వికట రూపంబు జేసిరా వింత బలులు ॥ 143

కం.:- కానున్నదినాశంబిక
నేనెట్టులనాపగలను నీతివిడిచియా
జానకి దెచ్చిన ఫలమిది
యీనాడీ లంక గాయనెవ్వరి తరమౌ ॥ 144

వచనము.:- అని నిశ్చయించి తిరిగి యుద్ధభూమిని జొచ్చి, అధర్మ పక్షంబున నున్న తనకు చావు తప్పదు గాన ప్రాణమున్నంతవరకును జయాపేక్షతోనే బోరవలయు ను, ఈ విధముగా నా జన్మ భూమి ఋణము దీర్చుకొని నా యన్నకు సంతోషంబు గూర్చెదననిదృఢ చిత్తంబునొక్క సారి సింహనాదంబు జేసి వానర సైన్యంబుపైబడిన,

వాని ధాటికి తాళజాలక వానరులు రాముని మరుగు జొచ్చిరి. అంత
దశరథ నందనుడు ప్రచండ క్రోధంబున నారి సారించి 145

కం.:- రారా! రాక్షస నిలునిలు
బోరుమునా ముందు నిలచి బొరబొర తేలన్
వీరుడనని దెగబలసిన
క్రూరుడ నిన్నిపుడెయముని కొంపకు బుత్తున్ ॥ 146

కం.:- వాడి గల బాణతతులన్
జోడుగ గుప్పించి వాని నుశరీరంబున్
గాడించి నొవ్వజేసిన
వాడి తనువు గూలె క్రింద వానరులణగన్॥ 147

కం.:- కనులను నిప్పులు గ్రక్కుచు
ననిలోనా కుంభకర్ణు నణగంజేయన్,
గనుగొని రక్కనుతెల్లరు
దను జేంద్రుని వద్దకపుడె తరలిరి భీతిన్ ॥ 148

కం.:- అనుజుని మరణము వినియా
దనుజేశుడు నేలగూలి తల్లడమందెన్
వినరానివింతలీవిధి
గననయ్యెను నేడు మనకు గాలముదప్పెన్ ॥ 149

కం.:- ఘనబలుడు కుంభకర్ణుం
డని లోగూలంగ వలసె నామనుజునిచే
గనజాలరమరులేయీ
దనుజుని సమయింపగలిగె దశరథసుతుడున్ ॥ 150

కం.:- ఏమందును విధినాయెడ
నీమముదప్పించి యెదుట నిలచెను నేడీ
రామునిచే మాలంకకు
నేమగునో చేటునింక యేమనజెల్లున్ ॥ 151

కం.:- అని చింతించెడి రాజును
గనియందరు భీతిజెంది గ్రక్కుననపుడే,

జని మేఘనాధుతోడన్
వినిపించిరి కుంభకర్ణు వృత్తాంతంబున్ ॥ 152

## మేఘనాధుని యుద్ధము

వచనము:- కుంభకర్ణుని మరణమును, రావణుని నిర్వేదమును విని ఇంద్రజిత్తు కోపముతో-ఏమీ! యానరవానరులయాగడము! మహాబలుని కుంభకర్ణుని గూల్చి మాతండ్రిగారికే చింత గలిగించిన వారలంబట్టి జంపక విడువను. అని మహారౌద్రముతో యుద్ధసన్నద్ధుడై బయలు దేరి, తండ్రికి నమస్కరించిన కుమారుని జూచి, మహావీరులగు నీ సోదరులు నరాంతక, దేవాంతక, అతికాయ, మహాకాయులును, మహోదర, మహాపార్శ్వాదులును ఆ నరవానరులంజెనక జాలక యుద్ధమున గూలిరి. దైవము మనకు ప్రతికూలముగా నుండెను.కానిచో, యా నరమర్కటములకా శక్తియెట్లువచ్చె- 153

కం.:- అనవిని దనయుడు తండ్రికి
వినయము దీపింప మ్రొక్కి వెడలెదనిపుడే
యనుమానమేలనన్నిపు
డనువుము సంగరము జేతు నందరు మెచ్చన్ ॥ 154

కం.:- కాలము గీలముగాదని
యేలా యీజంకు గొంకు లికనైనను నా
కాలమున కనుమతింపుచు
జాలగదీవించి బంపు జనకాయనుచున్॥ 155

కం.:- నేనా దశరథసుతులన్
వానరులను బట్టి జంపి వచ్చెదనిపుడే,
యీ నీచింతను విడుమా
సేనను బుత్తెంచి నాకు సెలవిమ్మనగా,॥ 156

వచనము.:- రావణుడును ఇంద్రజిత్తుని బలశౌర్యమ్ములు దెలసినవాడు గావున కృతనిశ్చయుడై 157

కం.:- ఏమైనతప్పదిక సం

గ్రామమ్మా భారమంత గైకొనినీవే
యేమరపాటున్ జెందక
నామానవ కీశకముల నణచగ వలయున్ ॥ 158

వచనము.:- అని దీవించి పంపిన, మేఘనాధుడు చతురంగబలసమేతుడై, ధవళఛత్రచామరముల మెరయ భేరీ మృదంగవములు భూనభోంతరాళములు నిండ, లంకా నగరము వెడలి సమరభూమిని ప్రవేశించి, సింహనాదంబుజేసి, ప్రచండక్రోధంబున 159

కం.:- మేఘములయందు దాగుచు
లాఘవమున ఖడ్గమెత్తి లంఘించెను దా
నేఘడియ యెక్కడుండునొ
యేఘడియను మీదబడునొ యెరుగగనీకన్ ॥ 159

కం.:- సురవైరి ఖడ్గధాటికి
గిరులన్నియు బారవైచి గీపెట్టుచునా
దరుచరులు భీతి తోడన్
బరువెత్తిరి రామచంద్రు పదములదరికిన్ ॥ 160

కం.:- కనుగొని లక్ష్మణుడప్పుడు
దనుజునిపై శరములన్ని దగుదగుననగన్
వినువీధిని గుప్పించెను
ధనువును సంధించి విడచె ధైర్యముతోడన్ ॥ 161

కం.:- దనుజసుతునిజంపుటకై
మనుజేసుని తనయుడంత మహిమాన్వితమౌ
ఘనమగు బ్రహ్మాస్త్రంబును
మనమున మంత్రించివైచి మడియగ జేసెన్ ॥ 162

తే.గీ.:- ఇంద్రజిత్తుని జంపెనా యినకులుండు
దైత్యులందరు బరువెత్తి దనజనాధు
గుండె బగులగ దెల్పిరా ఘోరవార్త
గొల్లుమని రావణుండేడ్చి గూలబడియె ॥ 163

కం.:- లంకానగరంబంతయు

కంకటిలుచురాచనగరు గప్పెను ప్రభువీ
సంకటమెట్లు భరించునొ
యింకేవిధిబ్రతుక గల్గు నీరాజనుచున్ ॥ 164

తే.గీ.:- రాణి యేడ్చుచు బరువెత్తె రాజుదరికి,
యెంతజెప్పిన వినవైతి వేమి జేతు
యిప్పుడీ శోకమెట్లు సహింతు నాథ
యను విలపించి యాసాధ్వి యవని గూలె ॥ 165

తే.గీ.:- కోడలిని జూచి యేడ్చుచు గూలబడియె
నేమి జేయుదు నాకునింకేది దారి
యెంత జేసెను దైవమ్ము నింకమనకు
యేల బ్రతుకులు రాజ్యమదేల నింక ॥ 166

తే.గీ.:- నాశమైతిమి వంశమే నాశమయ్యె
యిప్పుడైనను జానకినిచ్చి వేగ
శరణుబొందుము రాముని చరణమందు
నాదు మాంగళ్యమైనను నాకు నిల్చు ॥ 167

వచనము.:- అని గోలు గోలున నేడ్చు మండోదరిని జూచి రావణుడు మూర్తీభవించిన శవము వోలె నొక్కింత తడవు నోటమాటరాక మిన్ను విరిగి మీద బడ్డ చందంబున దుఃఖించి, దేవీ! యింకమనకు మిగిలిన దేమి? ఈ ప్రాణములే గదా! సర్వము నాశనమైన పిదప జీవించనేల, ఈ ప్రాణములపైయాశతో సీతను శ్రీరామున కిచ్చి యాతని శరణు జొత్తునా! అంతయు విధివిలాసము, కానున్నది కాకమానదు. ప్రాణమున్నంతవరకును శత్రువు నెదిరించెదనేగాని, పగవాని శరణు బొందజాలను, ముల్లోకములు గడగడలాడించిన నేను, నేడు పరుల యాచించలేను. పరమేశ్వరుని మెప్పించి మహాస్త్రంబులు బొంది, అష్టదిక్పతులనే యరికట్టిన నేను, నేడీనరవానరుల చే మహావీరులగు పుత్రులను బోగొట్టుకొని ఘోరదుఃఖంబున బొగుల వలసి వచ్చె. ఈ ఆపదలన్నిటికిని ఆ సీతయే కారణము. ముందుగా దానిని జంపి యుద్ధభూమి కరిగి యానరవానరులంజంపెద, అటుగానిచో

యుద్ధముననే వీరస్వర్గమునకేగెద అంతియే కాని, పరులయాచించనని కృతనిశ్చయుడై, చండమార్తాండుడై కండ్లవెంబడి నిప్పులు గురియ, దుఃఖము క్రోధముగా మారి, పెద్ద పెద్ద యంగలతో, నొరదీసిన ఖడ్గముతో ప్రళయకాలరుద్రుడై అశోకవనమున కేగిసీతను నరక బోవ అచ్చటి వారందరు భయకంపితులై గడగడ వణక సీతయు పెను గాలికి కదిలి పోవు తీగ వలె భీత లోచనయై భూమిపై బడి మూర్చిల్లె. నంత సుపార్శ్వవనెడి వాడు రావణునడ్డగించి-168

కం:- తాత పులస్త్యుడు నీవా
ఆ తత వేదాంగ విదుడ వైయుండి యిటుల్
నాతిని జంపియు నీప్ర
ఖ్యాతిని విడనాడ పాడిగాదు సురారీ! 169

వచనము:- అదియునుగాక ఈమె దెలివి దప్పియున్నది యిట్టి దానిని జంపదగదు రమ్మని దీసికొని పోయెను. రావణుడు మూల బలముల నాయత్తము గమ్మని తాను శస్త్ర పాణియై రథంబు నధిరోహించి యుద్ధభూమికేగి పుత్రశోకమున క్రోధావేశంబుల నున్మత్తుడై శత్రుల నెదుర్కొని మహాశరంబుల గుప్పించెను. 170

## రావణుని అస్త్రంబున లక్ష్మణుడు మూర్చిల్లుట

మంత్రులగు ఉన్మత్తుడును, సుపార్శ్వుడును, విరూపాక్షుడును తమ రాజుతో శత్రువులపైబడి దునుమాడ దొడంగిరి. సుగ్రీవుడు ఉన్మత్త విరూపాక్షుల నెదుర్కొని వారలం జంపెను. అంగదు సుపార్శ్వుని మడియించె. అది చూచి రావణుడు మహాక్రోధంబున నిప్పులు గ్రక్కుచు యెదురుగా నున్న విభీషణుని గాంచి వీనికతంబుననే యీ మానవ మర్కటాధముల కంతబలమ్ము వచ్చెనని రోషకషాయిత లోచనుండై మహాశక్తియను నొక అస్త్రంబు ప్రయోగించె, నదియు అగ్నిజ్వాలలు గురియించుచు విభీషణునిపై బడు సమయంబున లక్ష్మణుడు దానికెదురై బడగొట్టబోయెను. గాని ఇంతలో నా మహాస్త్రము

లక్ష్మణుని యురమునదాకె నంత లక్ష్మణుడు నేలగూలెను. వానరులా హాకారంబులు గావించిరి. శ్రీరాముడు తమ్మునవస్థను జూచి యారావణునెదుర్కొని మహాస్త్రంబులగుప్పించెను. రాముని అస్త్రధాటికి నిలువజాలక రథంబు మరలించుకొ రావణుడు లంకాపురాభిముఖుడైబోయెను. రాముడు సౌమిత్రి బడియున్న తావునకేతెంచి తమ్ముని ఒడియందిడుకొని విలపింప దొడంగెను.

సీ:- తమ్ముడానను వీడి తరలిపోతివిగదా
యయోధ్యకేనెట్టు లరుగుదెంతు,
నీదుతల్లి సుమిత్ర, నీపత్ని యూర్మిళ
కేమనిజెప్పుదునేమి, సేతు
నయోధ్యవిడనాడి యడవిలో నాతోడ,
నతికష్టములునొంది తనుజ నీవు
నీవుబోయిననిక నేనెట్లు బ్రతుకుదు,
నీసీత యీరాజ్యమేలనాకు? 171

తే.గీ:-ఆటప్రాయంబులోనైనయన్ననిన్ను
వదలలేనని నాతోడ వచ్చినావు
యేమిజేతునుతమ్ముడా యేదిదిక్కు
నిన్నువిడనాడినేనెట్లు నిలువగలను॥ 172

వచనము:- అనుచు రాముడు శోకభారంబునోపజాలక, దుష్టశిక్షణ, శిష్టరక్షణ జేసి దేవబ్రాహ్మణులకు శాంతిభద్రతలు జేకూర్చవలయునని నేను నిశ్చయించితిని. గాని ఆ దేవతలుసహితము నాకు పగవారై నన్ననేక కష్టంబుల పాలుజేయుచున్నారు. ధర్మబద్ధుండనగు నాకు పత్ని వియోగమును, భ్రాతృ శోకంబును గలిగించి యూరక చూచుచున్నారు. యీధనుర్బాణములతో ముందుగా నింద్రాది దేవతలనుసంహరించి తదుపరి రావణుని జంపెదను. అందరును నాశనము జేసి నాతమ్మునితో నేనును ప్రాణత్యాగము జేయుదునని కన్నుల నిప్పులురాల నిలచిన, విభీషణ, జాంబవంత, సుగ్రీవాదులు శాంతవచనములతో రామచంద్రా! శాంతింపుము. నీవే యలిగిన

ముల్లోకము భస్మములుగావె! దైవాంశ సంభూతులును, వరపుత్రులును
నగు మీకు మరణంబులేల గలుగును? లక్ష్మణుడు మరణింపలేదు.
మూర్ఛిల్లియున్నాడు. ఈతనిని దివ్యౌషధంబులచే బ్రతికింపవచ్చును.
అని జాంబవంతుడు హనుమంతుని జూచి 173

తే.గీ:- అంజనీపుత్ర నీవిట్టులడలదగునె
ద్రోణపర్వతమున్నది దూరసీమ
నందునున్నది దివ్యమౌ నౌషధంబు
దానిగొనిదెచ్చి బ్రతికింపు దాశరధిని॥ 174

తే.గీ:- అర్కుడుదయింప సౌమిత్రి యస్తమించు
దెల్లవారకముందునే దెమ్మునీవు
నిట్టి కార్యంబు సాధింపనెవ్వడోపు
నమిత బలతేజనీవేగాకాంజనేయ 175

కం:- తెల్లని యాకులు గలిగియు
వెల్లివిరిసిబూసియుండు విరులటనెరుపై
పుల్లని పచ్చని పండ్లతొ
చల్లని రాత్రులనె మెరయు సంజీవికడున్ 176

వచనము: రాత్రియందే దానిని సాధించవచ్చును. దానికి సంజీవకరణి, సావర్ణ్యకరణి, సంధానకరణి , విశల్యకరణీయను నాల్గుభాగంబులుండును. దానిని దెచ్చిన లక్ష్మణుడు మనకు దక్కును. గావున నీవుత్వరిత గతిని జని సంజీవిని సాధించి దేవలయును. రామచంద్రునకు దుఃఖోపశమనము గావింపవలయునని బలుక శ్రీరాముడు ఆంజనేయుని హస్తములంబట్టుకొని హనుమా! లక్ష్మణుని బ్రతికించి నాకు సోదరుని ప్రసాదించుము. ఇంతవరకును మేము నలువురన్నదమ్ములము. నేటినుండి నీతో ఐదుగురమగుదుము. యోజనసహస్రములు దూరమందు గల ద్రోణ పర్వతము దరికేగి కార్యసాఫల్యముజేసి కొనిరమ్ము మా ఇక్ష్వాకు వంశముద్ధరింపుమని బలుక 177

కం:- అది విని నంతనె హనుమయు

మదిలోనం సంతసించి మానవనాథున్
పదములకు మ్రొక్కి భక్తితో
గదలెను సంజీవి కొఱకు గదబూనివడిన్ ॥ 178

కం:- జలనిధిని దాటి యెగురుచు
బలతేజము వెల్లివిరియ భక్తిదలిర్పన్
దలచుచు రాముని నామము
కలకల నాదంబుజెలగ కపివరుడంతన్ ॥ 179

వచనము:- ఆంజనేయుడు సంజీవినిదెచ్చుటకై బోయిన సమాచారము వేగులవారి వలన వినిన రావణుడు మారీచపుత్రుడగు కాలనేమిని బిలచి సంజీవిదెచ్చుటకు బోయిన వాయుపుత్రుని కార్యమునకు విఘ్నము గావించుము, సూర్యోదయమగువరకును మసలిన జాలును. అటుపై సంజీవి దెచ్చినను లక్ష్మణుడు బ్రతుకజాలడు అని ఆదేశించిన కాలనేమియు రావణుని కెదురాడ జాలక రాజాజ్ఞ మేరకు మాయా తాపసియై ఆంజనేయుని మార్గమున ఆశ్రమము గల్పించి మహాతపస్వియో యనునటుల గనిపెట్టెను. ఆ వనమునగల మృగంబులన్ని పరస్పర వైరమువీడి సింహంబులును బులులును, హరిణశాబకములను, గోవులను మసలుచుండ ఆంజనేయుడా వనమున గల ఫల పుష్పంబులును కమనీయజల పూరితమైన సరోవరంబును జూచి యొక్కింత దప్పి దీర్చుకొనగోరి యామాయాతాపసికి నమస్కరించి, మహాత్మా! తమరుసెలవొసంగిన నేనీఫలజలవములచే నాకలిదప్పులందీర్చుకొందుననన, కాలనేమియువానిని దీవించి తియ్యనిమాటలతో బలుకరించి ఆ వనఫలములందిని ఆ సరోవర జలముల గ్రోలుమన అతడట్లే సరోవరమున దిగి కాలుచేతులు కడిగికొని నీరంబుల ద్రావెను. వగలంతయు రణరంగమున నలసియుండి నయాతనికా జలములమృతోపమానములైనవి. ఇంతలో ఆసరోవరములోనున్న నొక మొసలి హనుమంతుని పాదముబట్టి లోని కీడ్వ సాగెను. అది చూచి హనుమంతుడు-అయ్యో! నేనెంతతెలివిమాలినవాడను.

తెల్లవారక ముందె సంజీవిని దేవలసియుండ మార్గమధ్యంబున దడసితిని గదా! దాహాపేక్షచే స్వామికార్యమునాలస్యము జేయుచుంటినే!యిప్పుడీ మొసలినుండి విడివడవలయునని చింతించి శతవిధములా ప్రయత్నించిననం ధానివట్టునం విడిపించుకొనలేకపోయెను. 180

తే.గీ:- ఏమిజేయంగ వలెనిపుడెట్లుదీని
పట్టువిడిపింపగా దగు బలమదేది
అనుచుయోచించి హనుమంతుడయ్యె నొక్క
చిన్ని రూపము ధరియించి జీల్చెదాని ॥ 181

తే.గీ:- ఉదరమున జొచ్చి జీల్చుచు నుండ నపుడె
మకర రూపంబు విడనాడి మగువయయ్యె
చోద్యమందంగ నంతనా సుదతి బల్కె
నాదుశాపంబు మోకార్చినావు నీవు ॥ 182

తే.గీ:- వందనమ్ములు గొనుమయ్య వానరేంద్ర
పూర్వభవమందు నచ్చర పుటుక బుట్టి
శాండిల్యుని శాపమున నైతి జలచరంబు
నేటికయ్యెను నిజరూపు నీదు దయను ॥ 183

వచనము:-నేను ధ్యానమాలినియను అచ్చరను ఒకనాడీ సరోవరమున జలకమాడుచుండ శాండిల్య మహాముని నన్నుగవయగోరెను. గాని రజస్వలనగు నేను మూడుదినములు గడచిన పిదప నీకోర్కెదీర్తునని బలుకితి. నంత నాముని యధేచ్ఛంజనియె, తరువాత దనుజనాధుడగు రావణుడు నన్నుగోరిన, విషయమంతయునెరిగించి నేను ముని దత్తమైతినని జెప్పినను వినక రజస్వలనగు నన్ను గవసి తన కోరిక దీర్చుకొనియె. నంత నేను సద్యోగర్భనై యొక పుత్రునిగంటిని. రావణుడాపుత్రుని తన వెంట దీసుకొనిపోయి అతి కాయుడను పేరుబెట్టి బెంచుకొనియె. తరువాత శాండిల్యుడరుదెంచి విషయమంతయు గ్రహించి, నాకుదత్తవైన నీవు పరుని గూడితివి గాన నొక భయంకర మకరివై యీ సరోవరమున బడి యుండుమని

శపియించె. తదుపరి రామ కార్యార్థమై వచ్చు వాయునందనుని వలన శాపోపశమనమగునని బల్కిన ముని వచనములు విని యిందు నీరాకకొఱకెదురు చూచుచు నిటబడియుంటిని. నీవలన నేటికి నా శాపము దీరె నాకు సెలవిమ్ము బోయెదనని, రావణుని పంపున కాలనేమి అను రక్కసుడు మాయాతాపసియై నీకార్యమున కాటంకము గలిగించెను. గాన నీవామాయాతాపసి మాటలు నమ్మక సంజీవికై బొమ్ము నీ కార్యము సఫలమగునని బలికి దివంబున కేగెను. ధాన్యమాలిని పలుకులకాశ్చర్యమొంది వాయునందనుడు కాలనేమిపై క్రోధంబున వానిచెంత కరిగి తన ముష్టి ఘాతముచే వానిని జంపి ద్రోణ పర్వతము వైపునకు బోయెను. 184

తే.గీ:- చేరి హనుమంతుడాద్రోణ గిరిని జూచి
పర్వతమునంత శోధించె బాగుగాను
దృశ్యమగుచుండె వెలుగుచు దూరమునకు
సంతసంబున దరి జేర నంతరించు ॥ 185

వచనము:-జాంబవంతుడు తనకు జెప్పిన జొప్పున సంజీవి దరికేగి ఆ మొక్కలు దీయ బ్రయత్నించిన, నవి నదృశ్యమగుచుండెనంత హనుమంతుడు విసిగి యా పర్వతంబునే పెకలించుకొని పోవ సంకల్పించిన వాడై తన వాలమును బెంచి, ఆ పర్వతమును చుట్టి పెకలించుట జూచి అచ్చటనున్న గంధర్వులు హనుమంతు నెదిరించిరి. రామ కార్యార్థమై వచ్చిన వాయునందనుడు వానినాపకుడని అశరీరవాణి బలుక వారును వైదొలగిరి. అంతట వాయునందనుడా పర్వతమునెత్తి తన అరచేత నిడుకొని రెండవ చేతితో తన గదనుబట్టి ఆకాశ గమనంబున నందిగ్రామము మీదుగా బోవుచు క్రిందనున్న భరతుని జూచెను. భరతుడును ఇదేదియో మహాభూతముగావును. దీని బరిమార్చెదనని విల్లంబులు బట్ట అశరీరవాణి ఓ భరతా! వాని నాటంక పరపకుము అతడు శ్రీరాముని భక్తుడని బల్కెను. జటావల్కలములు ధరించి శ్రీరాముని బోలియున్న భరతుని జూచి ఇదియేమి? రామచంద్రుడిటకేలవచ్చెను. లక్ష్మణుని విడచి, రావణుని

జంపక రాముడేల వచ్చును. అదియును గాక, ఈ రాత్రి సమయంబున లంకాపురి నుండి ఇంతదూరము వచ్చుట అసంభవము. ఈ ఆలోచన లేల ఆవలసమయము మించి పోవునని లంకాపురాభిముఖుడై పోయెను. 186

కం:- ఒక చేత ద్రోణ పర్వత
మొకచేతను గదనుబూని యొప్పెను జూడన్
బెకిలించి మందరాద్రిని
నకలంకుడైనవిష్ణు వన భీకరుడై ॥ 187

కం:- రావణు పంపున నెందరో
రావణుననుచరులు వచ్చి రాముని దూతన్
వే విధముల బీడించిరి
రావణు పంతమ్ము దీర్ప రాగల మనుచున్ ॥ 188

తే.గీ:- మాల్య వంతుండు వచ్చెను మదముజెంది
ఆంజనేయునితో బల్కె నడ్డగించి
బారవేయుము జలధిలో పర్వతమ్ము
గానిచో నిన్ను బలిజేతు గాచుకొమ్ము ॥ 189

కం:- అని బల్కి వాయునందను
గనుగొని యద్ధంబు నిలువ కపివరుడంతన్,
బెనువాలంబున నాతని
బనిపెను లంకాధి నాథు పట్టణమునకున్ ॥ 190

వచనము:- మాల్యవంతుని పీచమడంచి హనుమంతుడు యుద్ధభూమిని జేరబోవ --- 191

కం:- నిండెను కాంతులు భువిపై
మెండుగ తూరుపున వెలుగు మెరయుచు నుండన్
మండిపడి రాముడంతట
దండన జేయుదును భాను దర్పము నణతున్ ॥ 192

తే.గీ.:- వంశపురుషుండు మారఘు వంశమునకు
వంశనాశము జేయంగ వచ్చుచుండె.

వాని నరికట్టి ముంచెదన్ వారియందు
ననుచు కోదండ మెత్తెనయ్యవసరమున ॥ 193

వచనము:- చండకోపియై మండిపడుచున్న రాముని వారించి జాంబవంతుడు - రామచంద్రా! శాంతింపు మింకను మూడవ ఝాము మాత్రమే గడచెను. అది సూర్యోదయముగాదు. అనిల తనయుడు సంజీవిని దెచ్చుచుండనేపు. ఆ దివ్యౌషధము కాంతియే యిది సందియము లేదు. లక్ష్మణునకు ప్రాణాపాయము గలుగదు. నామాట నమ్ముమని బలుకుచుండ ఆంజనేయుడా ద్రోణాద్రిని సువేలా పర్వతమున బెట్టెను. అది జూచి జాంబవంతుడును సుషేణుడును బరుగునబోయి ఆ ద్రోణాద్రిని జూచిరి. వారలతో వాయునుతుడు 194

తే.గీ.:- ఇందు సంజీవి యేదియో యెరుగలేక
నద్రి నేదెచ్చితిని జూడు డద్రియందు
నెచటనున్నదొ సంజీవి యేర్పడంగ
రాముతమ్ముని బ్రతికింప రండువేగ ॥ 195

వచనము:- వాయునందనుని మాటలక మందానందంబున సుషేణుడా పర్వతమంత సోధించి యందుండి సంజీవి కరణియు, సావర్ణ కరణియు, సంధానకరణియు, విశల్య కరణియు నేరిదెచ్చి లక్ష్మణుని మేనబెట్టిన - విశల్యకరణి వలన అంబులనాటిన చోట గాయము గూడ గానబడక శరీరమెప్పటియట్లె యుండె. సావర్ణకరణి వలన గాయమగు చోట శరీరంబత్తుకొని ఆనమాలయినను గానరాదయ్యెను. సంధానకరణివలన శరీరము జీవనాడులతో కాంతివంతమయ్యెను. సంజీవికరణి వలన ప్రాణవాయువులు సంచరించెను. నిదురనుండి మేల్కాంచి నటుల లక్ష్మణుడు లేచికూర్చొనెను. రాముడమందానందము తమ్ముని కౌగలించుకొనెను. వానరులందరును సంతసించిరి. వాయునందనుని ప్రశంసించిరి. సుషేణుని గొనియాడిరి లక్ష్మణుడన్నను గౌగలించుకొని రేపటి యుద్ధంబున రావణుని సంహారించి తీరవలెనని నిశ్చయంబుగా బల్కిన రాముడును

యింకనుపేక్షింపరాదని మరునాటి యుద్ధమునకై ఆయత్త పడుచుండ భువన బాంధవుడు వారల కోర్కి దీర్పనేతెంచె నోయన ప్రభాతసమయమాసన్నమయ్యేను. 196

## రావణుడు పాతాళహోమము జేయబూనుట

సీ.:- సంజీవిదెచ్చుట సౌమిత్రి బ్రతుకుట
వానరుల్ సంతోష వార్ధిదేల,
వారలు వేవేగ నేతెంచి
యేలిక కావార్త నెరుగ జేయ,
కళవళ పడి రాజు కాకుత్థ్సపతినింక
ననిలోనగెలువంగ నజుని తరమె
కాలంబు దప్పెను గాకున్న సీలంక
నరవానరులచేత నాశమగునె || 197

తే.గీ.:- యేమిజేయుదు నాకింక యేదిదారి
మేటి వీరులు నాసుతుల్ మేదినిలు
పాలబడి నారలీనాడు బడుగునైతి
వరబలమ్ములు సర్వము వ్యర్థమయ్యె || 198

తే.గీ.:- అనుచు చింతించి గురువుల నడిగెనిట్లు
నాదు ప్రాణంబు మానంబు నాకుమిగుల
యేమిజేయుదు నియ్యెడనేది తెరవు
తెలియజేయుడి గురువర తెల్లముగను || 199

వచనము:- నేనిప్పుడేమిజేసిన దాశరథుల గెలువగలను? అనతిండని బలక రాక్షసుల కులగురువును సర్వశాస్త్రప్రవీణుండును, ఆగమవేద్యియునగు శుక్రాచార్యుడు బాగుగా యోచించి, దనుజేంద్రా! శత్రుసంహారమునకు మంత్రమో, తంత్రమో నెలకొల్ప వలయును - గాన నేను నీకొక మంత్రముపదేశించెద. దానిని నీవు గొప్ప అనుష్టానముతో పాతాళహోమమాచరించి ఆ మంత్రము జపించుము.

నీకుజయము సిద్ధించును. ఎట్టి పరిస్థితి గల్గినను మధ్యలో దానిని విడువరాదుసుమా! అనిహెచ్చరించిన, విని రావణుడు వెంటనే స్నానాదిక క్రియలు నిర్వర్తించి, పాతాళం బోయనునట్లున్న నొకగుహాంతర్భాగమున ప్రవేశించి, గంధపుష్పార్పితమైన వేదికయందు అగ్నిని ప్రేల్చిదాని నర్పించదగినపరికరములుదెప్పించి, ఏకాంతమున నిశ్చల మానసుండై పాతాళహెూమము జేయుచు, కడునిష్ఠతో గురూపదేశమంత్రరాజమును జపియించదొడంగె. రావణుడు పాతాళహెూమముజేయ నాధూమ రాసులాకమునగప్ప విభీషణుడు రాముని దరిజేరి, రామచంద్రా! మాఅన్నయగు రావణుడున నీతోయుద్ధము జేసి నిన్ను జయింపజాలక శుక్రాచార్యుని పంపున మాయోపాయమున జయింప పాతాళహెూమముజేయుచుండె. ఆహెూమము నిర్విఘ్నముగానెరవేర్చిన వానినిజయించుట హరిహరాదులకైనను దుర్లభము. 200

కం:- కావున నేదోవిధమున
రావణుయాగంబు జెరచి రావలెనిపుడే,
యీ వానరులం బంపిన
నావల కార్యంబు సఫలమగు మీకనియెన్ ॥ 201

వచనము:- ఆ విభీషణునని మాటలువిన్నంతనే, అంగదుడు, హనుమ, సుగ్రీవ, సుషేణాదులు పెక్క వానర వీరులందీసికొని లంకానగరముసొచ్చి 202

కం:- వానరులందరునపుడే
వీనులదర బొబ్బలిడుచు వీధులలోనన్
బూనిపెను గొండలెత్తియు
నా నక్తంచరుల శిరసులణ గగజేయన్ ॥ 203

కం:- ఎక్కడ దాగెను మీరా
జెక్కడ నున్నాడొ మాకు నెరిగించవలెన్
జిక్కిరి మాచేతికినే
రక్కసిభటులార జెప్పరండనిమోదన్ ॥ 204

వచనము:- వానరుల భీభత్సమునకు రక్కసులు భయమొంది

పరుగిడుచుండ రాక్షసస్త్రీలను బట్టియు శిశువులను బట్టియు దండించుచు రావణుని జాడలు దెల్పుమని హింసింపుచు అంతిపురము బ్రవేసించిన - 205

సీ.:- ఆ విభీషణు పత్ని యావానరుల జూచి
చేసౌంజ్ఞ జేసియాచెంతనున్న
మందిరాంతర్భాగ మర్మంబు దెలిపిన
పరుగులెత్తెరి రాజు పట్టదలచి
యజ్ఞంబు జేయుచు నేకదీక్షను బూని
నిశ్చల మనసుతో నిలచుటరసి
హెూమంబు జేసెడి సామగ్రి నంతయు
బాడు చేసిరి వారు పంతగించి 205

తే.గీ.:- ఎంత జేసిన నచ్చట నేమియైన
కదపలేరైరి రావణు కఠిన దీక్ష
నెట్టకేలకు నంగదుడేగి దెచ్చె
పట్టమహిషిని రావణు పత్నిబట్టి ॥ 206

వచనము:- మండోదరియు పుత్రశోకమునబొగులుచు, విగతకేశినియై ముడిచిన పుష్పంబులు నేలరాల, రానున్ననాశమెరింగినదై, దుఃఖభరంబున నెలుగురాక ప్రాణేశ్వరునుద్దేశించి - 207

సీ.:- మంత్రి సామంతులు మహనీయులందరు
భటవర్గమెల్లను భగ్నమయ్యె,
వీరాధివీరులు విహిత గుణాఢ్యులు
పుత్రులు మిత్రులు పూజ్యులెల్ల
అతికాయుడక్షయు డామహాకాయుండు
మేటిబలుడు జూడ మేఘనాధు
డందర యుద్ధాగ్ని కాహుతి జేసితి
వదియెజాలదయింక నన్యమేల 208

ఆ.వె.:-దనుజ నాథయింక దపముయజ్ఞాది కం
బేలనయ్య జయమికేలనయ్య,

ధర్మపథము పీడి తరుణి దెచ్చిననాడె
లంకనాశమయ్యె శంకలేక ॥ 209

కం:- పుట్టితి దైవాంశంబున
మెట్టితి నాయింద్ర పదవి మించినయింటన్
పట్టితి లంకాధీశుని
పట్టుబడితి నిట్లునేడు పగవారలచే ॥ 210

కం:- వీరుడవు లోకమునగం
భీరుడవును దివిజ ధైర్య భేదన ధాటీ
ధీరుడ వతి సత్కర్మా
చారుడవైనట్టి నీవు సామాన్యుడవే ॥ 211

కం:- చాలింపుము నీహోమము
దూలింపుము శత్రువులను దోర్గర్వమునన్
దోలింపుము వానరులను
బాలింపుము నన్ను మిగుల పంతము విడుమా ॥ 212

కం:- ఏలితివీలోకమ్ముల
దోలితివింద్రాది సురల దోస్సారమునన్
చాలునిక యేల యుద్ధం
బేలా రాజ్యంబు నింక నేలా సుఖముల్ ॥ 213

ఉ:- చాలితివేని ముందునకు సాగుము యుద్ధము జేయు మియ్యెడన్
ద్రోలుము శత్రువర్గమును దూపులవాడిమి జూపి యింకనీ
వ్రేలెడి యగ్నిహోత్రమును వీడుము వేగమె రాక్షసేంద్ర నీ
కేలను సందియంబు పయనింపుము వీరపథంబు బొందగన్ 214

కం:- పొందితివేని జయంబును
నందగలవు కీర్తిలోక మందుననీవే
యిందున మడిసిన యా రఘు
నందనుచే నీకు గల్గు నమరత్వంబున్ ॥ 215

కం:- లెమ్మా! యాగము విడిరా
రమ్మా! శత్రువులనుండి రక్షింపంగగై

కొమ్మా! చేతను ఖడ్గం
బిమ్మా నవ వానరాళి నిపుడే జంపన్ ॥ 216

వచనము:- అని మండోదరి గోలుగోలుననేడ్చుచు భయవినయంబుల భర్తను ప్రార్థించుచు పౌరుషము గలుగునటుల నొప్పించుచు బల్క రావణుడు నిగ్రహము వీడి హోమగుండము వద్దనుండి లేచి వానరుల చేత జిక్కిన ప్రియపత్నిని జూచి ప్రళయకాలరుద్రుడై చంద్రహాసముచేబూని, అంగదుని మొత్తియు. ఆంజనేయుని యురమున బొడిచియు, సుషేణుని నొప్పించియు వీరవిహారము జేయ రావణుని ధాటికాగలేక మండోదరిని వదలి వానరవీరులు బారిపోయిరి. తాము వచ్చిన పని నెరవేర్చి పాతాళహోమము జెరిచితిమని యుత్సాహంబున రామునిదరికి పరుగులెత్తిరి.

రావణుడు ప్రియసతినక్కునచేర్చుకొని యోదార్చెను. అంతట మండోదరియు భర్తకార్యదీక్ష కాటంకమైనది నికనే విధముననైనను విజయము దుర్లభమని నిశ్చయించి భర్తను జూచి - 217

సీ.:- ప్రాణనాధయిపుడు పంతంబదేలను
నామనేహరవిను నాదుమనవి
దైవాంశమునబుట్టె దశరథ రాముడు
ధర్మ రక్షణ సేయ ధరణియందు,
పరదారదెచ్చుట బాపమంబెంచక
ధర్మమార్గంబును దప్పినాడ
వాది విష్ణుండు సర్వాంతరుండాతడు
సకలలోకములకు స్వామి యతడె ॥ 218

తే.గీ.:- కాననికనైన రాముని గావుమనుచు
శరణు జొచ్చిన మేలయ్య శంకవీడి,
సీత నర్పించి వేగమే జెందు సౌఖ్య
మార్త రక్షణపరుడతం డాది మూర్తి ॥ 219

కం:- కావున సంకోచింపక
బ్రోవుమనుచు వేడు మయ్య భూసుతగొనియా

భూవరుని కొప్పజెప్పుము
గావుమునిక నైన లంక గావుమునన్నున్ ॥ 220

వచనము:- అని బల్కు మండోదరిని జూచి రావణుడు - 221

కం:- చచ్చిరి బందుగులెల్లరు
జచ్చిరి వీరులును మంత్రి సామంతాదుల్,
జచ్చిరి సుతులందురునిక
జచ్చెద నింకేల లేక చంపెద రామున్ ॥ 222

తే.గీ.:- అంతియేగాని రాముని యడుగులందు
శరణు బొందంగ జాలను సఖియవినుము
సమర మందునగెలచుటో చావేగాని
నాదు పంతమ్ము విడలేను నాతి నిజము 223

తే.గీ.:- సమరమందున నాచావు జరిగెనేని
సీత జంపించ వలెవేగ చేడె నీవు
రాముపైపగ దీర్పుమా రాణి వగుట
చేరుమావలనను గూడ చితిని బేర్చి 224

కం:- అని రోషంబున రావణు
డనిలోనంబోరనిశ్చయంబున నపుడే
తన సతి మండోదరితో
జనియెను దమయంతిపురము సాహసయుతుడై 225

## రామరావణ యుద్ధము

కం:- ఆరాత్రి నంత నిద్రకు
దూరుండై సతియు తాను దుఃఖముతోడన్
భారముగను వేగించుచు
దూరుపు రేఖలను జూచి దొందర పడుచున్ ॥ 226

కం:- కాలపురుషుడరుదెంచెను
కాలము సమకూడె నింక కాకుత్సులకున్

కాలాంతకరుద్రుడనై
జాలము సేయకయె జంపి జచ్చెద నాజిన్ ॥ 227

వచనము:- రావణుడు సైన్యంబాయత్తము జేసికొని, రథారూఢుడైన సురవీరులు బరివేష్టింప 228

సీ.:- పట్టు పుట్టంబులు బాగుగా ధరియించి
చంద్రహాసంబును జిక్కబట్టి
వజ్రహారంబులు వైఢూర్య కాంతులు
దిక్కులనంతట దీప్తి జెంద
నిరువది బాహువుల్ నింపొంద భుజకీర్తు
లందముల్ జిందగా నవనియదర
రథముపైనున్నయా రావణుతేజమ్ము
దశదిశల్ మొండుగా దళుకులీన 229

ఆ.వె.:-కండ్లనుండి యగ్ని కణములు రాలంగ
ప్రళయకాలరుద్రు పగదిదోప
చండభానుడనగ మండించి దిక్కుల
రావణుండు వచ్చె రణము జేయ ॥ 230

సీ.:- భేరీ మృదంగముల్ ఘోరున మ్రోయంగ
రథ గజ తురగాది రాణువంత
భీకర ధ్వనులతో భీభత్సమొనరించి
పిడుగులో యనునట్లు భీతిగొల్పి
పంచభూతంబుల ప్రళయార్భటులనంగ
దావాగ్నులను నట్లు ధరణివెలుగ
రక్కసి వీరులు రభసంబు తోడుత
నింగిని నేలను నిండియుండి 231

ఆ.వె.:-బాణ వృష్టి గురిసి భానుమండలమున
గప్పెనీలవర్ణ గగనమనగ
ధరణియందుబడిన శరజాలములు నేల
రక్తమయము జేసి రంగుదీర్చె 232

ఉ:- ధారుణి క్రుంగ జేయుచును దానవనాథుని పాదఘట్టనల్
వారిధులింకగా కనుల బాడ బహహ్నికణంబురాలగా
వీరులగుండియల్ బగుల వేగమె వారలదృంచి శత్రుసం
హారము జేసి వత్తునని యంబుజనేత్రునెదిర్చి నిల్చినన్ ॥ 233

ఉ:- పోరెను పంక్తికంఠడరి పొంకమడంతునటంచునెన్నియో
ఘోరశరంబులంబరపి క్రోధమునంతయుగ్రక్కుచున్ మహా
ధీరగభీరుడై తనదు తేజము జూపుచు నెంతయోగడున్
వీరులగుండియల్ గదల వేసెను బాణపరంపరల్ వడిన్ 234

కం:- రావణుధాటికి నిలువగ
నేవీరునకైన దరమె యీయిలలోనన్
శ్రీ వరలబ్ధుండాతం
డా వానరుల నగనెంత అసురేంద్రునకున్ ॥ 235

కం:- అసురేంద్రుని బాణంబులు
గ్రసియింపన్ దొడగెనచటి గపిసైన్యంబున్
వసివాడి వానరంబులు
బసజెడి పరువెత్తె రామవల్లభు కడకున్ ॥ 236

కం:- దనుజేంద్రుని బలసంపద
మనుజేంద్రునిగూడ కొంత మైమరపించెన్,
వినువీధిని సురలందరు
గనుగొని విభ్రాంతితోడ గలవరమందన్ ॥ 237

కం:- సురలెల్లరు భీతిల్లగ
తరుచరులా సమరభూమి తలగిచనంగా
నరనాథు తనయులంతట
సురవైరిని గెలుచుటెట్లొ శోధించిరొగిన్ ॥ 238

వచనము:- రావణుడు సవ్యాప సవ్యంబులుగా యుద్ధము జేయుచుండ నతని బలవరాక్రమంబులను తేజంబునుగనుగొని రాముడాశ్చర్యమగ్నుడై యొక్కింత నివ్వెరపాటును [illegible]వ నంత నశరీరవాణి వాక్కులు వినంబడె 239

తే.గీ.:- శ్రీమహావిష్ణు వయ్యును చింతయేల
వంశకర్తయగునినుని వలనమీకు
జయము సిద్ధించు నికనేల సంశయంబు
భాను నర్చించి జేయుమా భండనమ్ము ॥ 240

వచనము:- ఆ పల్కులు విని తొల్లి అగస్త్యమహాముని ఉపదేశించిన "ఆదిత్య హృదయం" బను సూర్యమంత్రము స్ఫురింప బలవర్ధకంబును శత్రుజతియునగు నా మంత్రరాజమును పఠించి సవితృని స్తుతియించెను. ఆ మంత్రశక్తి వలన నూతనోత్సాహము బొంది ధనుర్బాణములు బట్టి శ్రీరాముడు ముందునకురికెను. విశ్వామిత్ర దత్తములగు మహాస్త్రంబులు రావణుపై బరపి ఆతని బాహువులు ఖండించెను. 241

కం:- శ్రీరాముడు రోషంబున
నారావణుపైన బరపెనంబులు పెక్కుల్
నారాయణ మంత్రంబును
ధీరత బఠియించి,తలలుతెగిపడ బుడమిన్ ॥ 242

తే.గీ.:- రత్నభూషణ హారముల్ రంగులీను
మకుట మండితమైనయా మణులు జెదర,
బాహువులతోడ శిరమును బడియె క్రింద
చూచుచుండగనంతలో చోద్యముగను, 243

తే.గీ.:- శిరసులంగూడి బాహువుల్ చిత్రముగను
మరల మొలకెత్తె నదియేమి మహిమ యొక్కొ
ఖడ్గ పాశంబులంగూడి కరములన్ని
మణులకాంతులు జిందె సమస్తదిశల ॥ 244

కం:- వేసిన శరములు బడగా
జేసెను కరమస్తకముల జెల్లాజెదురై
భాసిల్లె భూమియంతయు
రాసులుగా రత్నరుధిర రంజితమయ్యెన్ ॥ 245

కం:- శిరములు కరములు దెగుచున్

గరమతిముతి బడుచునేల గప్పెన్ జూడన్
తిరముగ మొలచెడి కరములు
శిరములుగను గొనగనంత జిత్రంబయ్యెన్ ॥ 246

## రావణుసంహారము

వచనము:- శ్రీరాముడు తన వద్దగల మహాస్త్రింబులం బ్రయోగించి రావణుని శిరములను కరములను ఖండింపనవి వెంటనే మొలుచుచు రణరంగమంతయు రక్తమయమై అందు బొరలుచున్న రత్నకిరీటమండితములైన శిరములును హస్తకంకణ కేయూరమణిమండితములైన కరంబులును నిండియుండ యెప్పటివలె రత్నమణికాంతులతో నిండిన కిరీటములతో శోభిల్లు శిరములును, హస్తకంకణకేయూరములతో వెలుగొందు బాహువులును ఎఱ్ఱతామరలవలె ప్రకాశించుచు క్రోధాగ్నిని గక్కుచున్న నేత్రములతో దేదీప్యమానముగా ప్రకాశించు రావణుని జూడ ఆప్రదేశమంతయు రామునకు రావణమయముగానే గన్పట్టె. రాముడాశ్చర్యమానసుడై నిలువ విభీషణుడు రాముని వద్దకు జేరి నెమ్మదిగా, రామా! రావణుని నాభిదేశమున నమృతభాండముగలదు. అందువలననే వానికి మరల శిరఃకరంబులుదయించుచుండె, గాన నీవాగ్నేయ బాణమును బ్రయోగింపుమన, రాముడాగ్నేయ బాణమున రావణుని నాభిని గలనమృతభాండము నింకజేసి, బ్రహ్మాస్త్రింబును ప్రయోగించి రావణుని శిరములగూలవేసె. అంత భూనభోంతరాళములు బగుల ప్రళయకాలుని భీకరరవములోయన, ఫెళఫెళారావములతో భూమిదద్దరిల్ల మహాపర్వతమే విరిగిపడెనోయన చుక్కలు రాలగా దనుజేంద్రుని శరీరము రథముపైనుండి జారిక్రింద బడెను. చండకోపియైన శ్రీరామునిజూడ జాలక సూర్యుడుగూడ పశ్చిమసముద్రమున దాగెనోయన సూర్యుడస్తమించెను. దనుజులందరును హాహాకారములతో లంకానగరమునకు బరువెత్తిరి.

దేవతలు సంతోషించి జయభేరులు మ్రోయించిరోయన వానరుల జయఘోషలు నిండె. పశ్చిమ సంధ్యాకాంతులు యెఱ్ఱని పుష్పములవలె శ్రీరాముని శరీరమును గప్పి దేవతలు గురియించిన సుమంబుల వేలె ప్రకాశించెను. మేరునగంబువేలె బడియున్న దనుజేంద్రుని ప్రాణజ్యోతి ఆకసమున కెగిరి పోయెను. శ్రీరాముడు నిశ్చేష్టుడై, నిర్నినిమేషుడై వ్యథాభరితహృదయుడై నిలువబడెను. లక్ష్మణుడమందానందంబున రాముని గౌగలించుకొనెను. రాముడు భాంమనస్కుడై లక్ష్మణునితోగూడి యాస్థలము వీడి పోయెను. 247

కం:- చుక్కలు రాలెను ధరణిన్
మిక్కుటమైనట్టి రవము మిన్నులనంటెన్
నక్కలు వడిగూసెనునలు
దిక్కులదర దైత్యులార్చె దీనతతోడన్ ॥ 248

కం:- లంకానగరంబంతయు
కంకటిలుచు గొల్లుమనియె కాంతలకగునా
సంకటములు గనజాలక
పంకజ మిత్రుండు మునిగె పడమట దిశలో ॥ 249

కం:- మండోదరి యేడ్చుచునా
దండిమగండైనయట్టి దనుజేసుగనెన్
దండధరునిలెరపించున
ఖండుడు రావణునకిట్లు కాలముమూడెన్ ॥ 250

కం:- శంకరభక్తుడుదివిజభ
యంకరుడై మౌనిజనుల నడలించి తుదన్,
కంకరనేలను గూలెను
పంకజనేత్రుండు రామబాణముచేతన్ ॥ 251

వచనము:- రత్నకంకణకేయూరమణిమండిత విరాజమానుండును, పీతాంబరధారియు, ఖడ్గమునొకచేతను చంద్రహాసంబొకచేతను ధరించినవాడును, తేజోవిరాజమానుండును మహాబలదర్ప సుందరదేహుండును విగతప్రాణుండునునైన యారావణుని జూచి

మండోదరి వానిపైబడి విలపించుచు - 252

సీ:- కైలాస కుధరంబు గదలించగలయట్టి
నీ బలమంతయు నేలగలసె
అష్టదిక్పతులనే నరికట్టగలిగిన
నీ శక్తియేమయ్యె నేడునాథ!
శంకరు పూజించి శక్తివంతుడవయ్యె
వేదశాస్త్రాగమ వేదినయ్యె
యెందేగె నీభక్తి యేమయ్యె నీశక్తి
నీ తపోధనమంత నిష్ఫలంబె. 253

తే.గీ.:- ఏమిజెప్పుదునా భాగ్యమేమనందు,
నాదుతలవ్రాత యిట్లయ్యె నాథ నేడు
విధిని నెదిరించి నిలచిన వీరవర్య
కన్నులనుమూసి పడినావె కటికనేల ॥ 254

సీ.:- మహనీయ మూర్తియా మయుడునాజనకుండు
నిత్య సత్యవ్రతుడు నిర్మలుండు
లంకాధిపతియైన శంకర భక్తుండు
పౌలస్త్యుడేనాకు భర్తయయ్యె
యింద్రునే తలదన్ను యింద్రజిత్తుడు నాకు
కన్నబిడ్డడనగ గర్వమొంద
అష్టదిక్పాలుర యతివలే నాకిల
నూడిగంబులుసేయనుత్సహింతు 255

తే.గీ.:- అట్టి యిల్లాలినై యిట్టులైతి నేడు
నాదు సౌభాగ్యమంతయు నాశమయ్యె.
యెంతవారైన విధిచేత వంతబడుట
కాలమహిమంబుగాదె నిక్కంబుగాను ॥ 256

సీ.:- దేవేంద్రు నేమించి దివిజ కాంతలతోడ
నింద్రభోగంబుల నందినావు
ధనపతినెదిరించి ధనరాసులనుదెచ్చి

మురిపించి యెంతయో మురసినావు
ధర్మంబు విడనాడ తగదని దెల్పినన్
వరబల గర్వంబు వదలవైతి.
కాంతమూలంబున గననయ్యె మృత్యువు
కాలమే యీవిధి కాటువేసె ॥ 257

తే.గీ.:- నరుడె నీపాలి మృత్యువై నాడు నేడు
యెట్లు సైరింతు నీ దుఃఖమెందు బోదు,
నిన్ను విడనాడి నేనెట్లు నిలువగలను
నన్నువీడుట న్యాయమే నాధ నీకు ॥ 258

వచనము:- అని విలపించుచు మండోదరి అచటనే ఖిన్నవదనుడై అపరాధివోలె నిలచి దుఃఖించుచున్న విభీషణునిగని 259

ఆ.వె.:-లంక గుట్టు దెల్పి లంకేశు జంపించి
జేసినావు వంశ నాశనమ్ము
రాముదయను బొంది రాజ్యమ్ము నంతయు
నేలుమింక నీవ యెదురులేక ॥ 260

ఆ.వె.:-అన్న యుద్ధు దీరె నడలంగ నేటికి
జింత వీడి యింక జెందు సుఖము
రాజ్యమేలు మికని రాక్షసమయ్యెను
శంకలేక నీశ్మశానభూమి ॥ 261

వచనము:- అని బలుకు మండోదరిని జూచి లజ్జావనత వదనుండై విభీషణుడు మండోదరికి ప్రణమిల్లి రావణుని పాదంబులంబడి రోదించెను. 262

కం:- కడువైరముతో నీపై
గడవగరానట్టి బాపకర్ముడనైనే
బుడమినపకీర్తి బొందితి
విడుచునె యీదురితమింక విడువదునన్నున్ ॥ 263

కం:- నా కారణముగ మృత్యువు
నీకిటు సంప్రాప్తమయ్యె నేనే మందున్

నాకాధిపతులనేలిన
నీ కాలముదీరె నింక నేడీరీతిన్ ॥ 264

కం:- వరబలసంపన్నుడవై
ధరయందున భోగములను దరణులతోడన్
గరముగ బొందియు మృత్యువు
వెరపెరుగని నీకు వచ్చె విధి ప్రేరితమై ॥ 265

వచనము:- అట్లు దుఃఖించుచున్న విభీషణుని లేవనెత్తి రాముడు - దనుజేంద్రా! నీవిట్లు దుఃఖింపదగునా "జాతస్య మరణంధ్రువమ్" అను నార్యోక్తి వినలేదా! సమయమాసన్నమైననేదోయొక నెపమున మృత్యువు సంభవించును. దానికి నీవుగాని, నేనుగాని కారణము గాదు. ఈతడు సామాన్యుడుగాడు. పరమేశ్వర భక్తుడు. తనతపో బలమున పరమేశ్వరునే మెప్పించి అమేయ వరంబులును బొంది ఇంద్రాదిదేవతలనే శాసించిన ధీశాలి. భూలోకమందలి భూరిసౌఖ్యములన్నియునునను భవించి, విధివశంబున నొక చిన్నదోషంబున నీతడు వీరమరణము బొందెను. గాన పుత్రహీనుడగు నీతనికి నీవు పుత్రసమానుండవుగావున విధి విధానంబుగా నగ్ని సంస్కారము గావించుము. ఈస్త్రీల నంతిపురమునకు బంపుమన విభీషణుడు తన మంత్రులగు రాక్షస వీరుల సహాయమున రావణున కగ్ని సంస్కారము గావించెనుత్తర క్రియలాచరించెను. సతీ ధర్మంబున మండోదరి పతితోడనే దివంబున కరిగెను. 266

## సీత అగ్ని ప్రవేశము

రాముని యానతిని లక్ష్మణుడు లంకానగరమున కరిగి విభీషణుని లంకారాజ్యమున కభిషేకము గావించె. యుద్ధమున జావగా మిగిలిన రక్కసులు క్రూరభావములు విడచి రాముని భక్తులై విభీషణుని వినయంబున గొలుచుచుండిరి. శ్రీరాముని సెలవంది విభీషణుడు సీతాదేవికి మంగళ స్నానములు జేయించి

వస్త్రాభరణములనిచ్చి దోడుకొని రమ్మని దనుజకాంతలం బంపిన, వారును శ్రీరాముని విజయమును, రావణుని నిధనమును సీతకు నెరిగించి రాముని వద్దకు వేంచేయుమన సీతయు సుస్నాతయై నూతనాంబరములు ధరియించి, ఆభరణములు నెల్లక నిరాడంబరయై నొక శిబికయందుపవేష్టించి, తన పతిని జూడబోవు చున్నందున ఆనందభాష్పంబులు జాలువార వచ్చి శ్రీరామునకు నమస్కరించెను.

రాముడును పెడమొగమై సీతనుద్దేశించి -

తే.గీ.:- పాప కర్ముడు రావణుపాలబడిన
చేడె నీచెరవిడిపింప జేసినాను
సతిని గాపాడ ధర్మంబు పతికి గాన
నాదు కర్తవ్యమని యెంచి నాతివినుమ ॥ 267

తే.గీ.:- పరుల గృహమునయున్నట్టి బడతివీవు
నిన్ను జేపట్టజాలను నేను వినుము,
నీకు నాటంక మికలేదు నేటినుండి
నీకు నచ్చిన చోటికి నీవు బొమ్ము ॥ 268

వచనము:- కర్ణశూలంబులగు రాముని మాటలు విని సీత గుండె బగుల నేడ్చుచు - 269

సీ.:- వసుధలో జన్మించి వరపుత్రినైతిని
జనకుని తనయనై జానకియన
ధరణిలో వెలుగొందు దశరథేశునకునే
పెద్దకోడలనైతి ముద్దుగాను
శ్రీరామచంద్రుని చేపట్టియయోధ్య
పురమందు మన్ననల్ బొందినాను
శివుని విల్లు విరచి సీతను పెండ్లాడె
జగదేక విభుడని జనులు బొగడ ॥ 270

తే.గీ.:- తండ్రి యానతి తలదాల్చి తపసియయ్యె
ప్రజలుగొనియాడ నడవికి బయలువెడలె
నట్టి ధర్మాత్ము నతినయ్యు నకటయిప్పుడు

భర్త చేతనే శంకింప బడితినేడు ॥ 271

సీ.:- ప్రారబ్ధవశమున పతికి దూరంబైతి
బ్రతుకెల్ల నాకింక భగ్నమయ్యె
పాపకర్ముని పాలబడియుంటి విన్నాళ్లు
నిందలపాలైతి నేటికెట్లు
కైకమ్మ మమ్ములకానల కంపించి
నట్టేట ముంచెను నాదుబ్రతుకు
యెప్పుడు నానాథు నెప్పుడు జూతును
శ్రీరామునెప్పుడు చేరుకొందు ॥ 272

ఆ.వె.:-అనుచు నిన్నిదినములడలుచునుండగా
వచ్చి జెప్పి పోయె వాయునుతుడు
రాముడేగు దెంచు రమణినిన్ గొనిపోవు
నడలనేలనమ్మ యతివయనుచు ॥ 273

వచనము:- అని సీత రోషకషాయిత లోచనయై, నామనోవాక్కాయ కర్మంబులా శ్రీరాముని చింతదప్పనన్యమెరుంగ ఈ పంచభూతంబులే సాక్షి, పరిశుద్ధనగు నన్నా పరమేశ్వరుడే రక్షించు, నాయెడ దోషము గలిగిన నన్ను భస్మంబు జేయును. యిన్ని మాటలేల 274

తే.గీ.:- నమ్మియుంటిని విన్నాళ్లు నాదుకొఱకు
పతికి పనిలేని నతికింక బ్రతుకదేల
చితిని నెలకొల్పు లక్ష్మణా! చింతయేల
నందరెదుటనే నేనిప్పుడగ్నిజొత్తు ॥ 275

వచనము:- అని సీత దృఢ నిశ్చయయై బలికిన లక్ష్మణుడన్న మొగంబు జూచి యాతని అభీష్టంబెరింగి వానరుల సహాయంబున అక్కడనే జితి బేర్చిన అగ్నియు పతివ్రతామ తల్లియగు సీత తనలో బ్రవేశించి తన్నుగూడ పవిత్రముజేయునని యానందించెనేయనునటుల అగ్ని జ్వాలలుమిన్నుముట్టె. సీతాదేవి ముకిళితకరకమలయై శ్రీరామునకు బ్రదక్షిణ మాచరించి, అగ్నికి ప్రదక్షిణము గావించి 276

కం:- పతిపాదయుగ్మమందే

మతినిల్పినదాననేని మనుజాధీశున్
సతినైన నాకు నీయెడ
సతి ధర్మమె రక్షయింక నందియమేలా! ॥ 277

కం:- నాయెడ దోషముగలిగిన
నీ యగ్నియె నన్నుగాల్చి యిందర యెదుటన్
జేయును భస్మంబిపుడే
నీయెడ నిదెనాకు సాక్షి యీ యిలలోనన్ ॥ 278

వచనము:- అని సీత అగ్నియందు ప్రవేశించెను. సీత చొరగనే అగ్ని శిఖలు ప్రజ్వరిల్లి ఆకమునంటెను. ఫెళఫెళారావములతో భూమి దద్దరిల్లెను. పరమసాధ్వియు, అయోనిజయునగు సీతను శంకించిన రామునపై క్రోధమును, అట్టి పతివ్రతామతల్లికిట్టి పరీక్షయా! యని లజ్జయు, సీతయేమగునేయని భయమును, ముప్పిరిగొన లక్ష్మణుడు కన్నులు మూసికొని రోదించెను. వానరులందరు హాహాకారంబులు గావించిరి. విభీషణ, అంగద, సుగ్రీవ, హనుమ జాంబవంతాదులు భయోద్వేగులైరి. దేవదుందుభులు మ్రోగె. ఒక్కసారి దేదీప్యమానమై భీకరధ్వనులతో మిన్నుముట్టిన అగ్ని అందరు చూచుచుండ చల్లబడి అందుండి సీతాదేవితోగూడ నొక దివ్యపురుషుడేతెంచి శ్రీరామునకు నమస్కరించి - 279

కం:- శుచినై జగములనెల్లను
శుచిగా నొనరించి నేను శోభిల జేతున్,
శుచియైన సీత వలనన్
శుచి నైతిని సత్యముగను శుభగుణచరితా! 280

తే.గీ.:- అగ్నియే సీత తనువును నంటలేదు
పరమపావని జానకి పద్మగంధి
సతిని శంకింప బనిలేదు, సాధ్వి యీమె
నీకు జెప్పంగ నేపాటి నీరజాక్ష ॥ 281

తే.గీ.:- కురులు జెదరవు వాడవు విరులుగూడ
మేని మెరుగులు జెడలేదు మేది నీశ

కన్ను లైనను నగ్నిని గందలేదు
చీర యైనను నలుగదు సీత సాధ్వి ॥ 282

వచనము:- అని స్థుతియింపుచుండ హర, విరించి, దేవేంద్రాదులాకసమునుండి శ్రీరామునుద్దేశించి - రామా! దశరథనందనా! కౌసల్యాతనయా! వైకుంఠవాసా! నారాయణా యింకను జాగు జేసెదవేల, లోకకల్యాణమునకే ఈ భూలోకమున నవతరించినపురుషోత్తమా! సందేహింపక సీతను పరిగ్రహింపుము. 283

కం:- సురనదికంటె పవిత్రము
తరుణీ మణి సీత యింక దడయగనేలా!
నరుడ వగుట దెలియవు శ్రీ
వరలక్ష్మియె సీత నీవు వరదుడ వయ్యా! 284

వచనము:-అనిబల్కిన, రాముడు తలయెత్తి వారలకు నమస్కరించి 285

కం:- ఎరుగుదు సీతాశీల
మ్మెరుగుదు నీకలంక యీమెయెచ్చటనున్నన్
యెరుగరు లోకులటంచే
నెరుగంజేసితిని గాని యెరుగనె సీతన్ ॥ 286

వచనము:- అని బల్కిన రాముని పల్కుల కందరను అమందానందమునొందిరి. సీతయు నానందభాష్పంబులు జాలువార రాముని పాదములకు ప్రణమిల్లెను. రాముడు సీతను లేవనెత్తి మన్నించెను. సీతారాములను జూచి అందరును సంతోషించిరి. పితృలోకమునుండి దశరథుడానందంబున సీతారాములను దీవించెను. దేవకంటకుడగు రావణుని సంహరించిన శ్రీరాముని కొనియాడుచు దేవేంద్రుడు - రామచంద్రా! నీవు మాకొనరించిన యీ యుపకారమునకు సంతసించితిమి. యేదేని వరమును గైకొనుమన రాముడు నానిమిత్తమై యీ వానరవీరులందరును శ్రమించి నాకు సహకరించిరి. యెందరో వానరులు రాక్షసులచే హతులైరి, గాన వారలకు పునర్జీవనము గలిగించ వలెనని కోరెను. దేవేంద్రుడట్లే జేసి దివిజలోకమునకేగెను. మృతవానరులందరును నిదురలేచినట్లుగా లేచి హర్షాతిరేకంబున

శ్రీరాముని స్థుతియించిరి. విభీషణుడు లంకానగరమునుండి అనేక ధనకనకవస్తువులును వస్త్రాభరణంబులును సీతారాములకర్పించెను. గాని రాముడవి స్వీకరింపక మావనవాస దీక్ష పూర్తియగు వరకును మాకివి నిషేధంబన విభీషణుడవి అన్నియు వానరులకు కానుకగానిచ్చి తన కృతజ్ఞతలు దెలుపుకొనెను. శ్రీరాముడు విభీషణునితో 287

తే.గీ.:- అనుగు మిత్రుడవైనాకు నసురవర్య
సల్ప్రితివి నాదుకార్యంబు సఫలమొంద
యింక నీవింటి కేగి నీయింతి తోడ
రాజ్య సౌఖ్యంబులందుమా, రాక్షసేంద్ర! 288

వచనము:- అని వానరులనుద్దేశించి - 289

తే.గీ.:- ఇంతవరకును నాకొఱకిన్నినాళ్లు
సతుల విడనాడి మీ ప్రియ సుతుల వీడి
కష్టములకోర్చి రికబోయి గనుడు సుఖము
వానరోత్తములార మీ వాసములకు 290

వచనము:- మీ కందరకును నా కృతజ్ఞతలు, నేను అయోధ్య కేగెదనన విని, విభీషణ, సుగ్రీవ, జాంబవంత, హనుమ, అంగదాదులు శ్రీరామునికి నమస్కరించి దేవా! మేమును మీతోడ నయోధ్య కేతెంచి భవదీయపురంబును, భరతశత్రుఘ్నాది భంధు జనులను దిలకించి తమపట్టాభిషేకము కన్నులార గాంచెదము. గాన మాకోరిక మన్నించి మీతోడ దీసుకొని పోవలెనన రాముడు సమ్మతించెను. విభీషణుడు రావణుని కౌబేరపుష్పకంబును దెచ్చి, రామచంద్రా! తామెల్లరును ఇందు విచ్చేయుడు. ఆకాశగమనంబున నిది తృటిలో మిమ్మయోధ్యకు దీసికొని పోగలదు. ఎందరధిరోహించినను నిందునింకొక్క స్థలముచొప్పున మిగులుచునేయుండును. ఇది దీని విశేషముగాన దయచేయుడని ముందుంచి జూపెను.

మణిమయసాలభంజకలు గల్గిన మండపస్థంభములును, అందు కనకమణులు, వజ్రవైఢూర్యగోమేధిక రత్నములు పొదగబడిన, చంద్రకాంతశిలావేదికలను, చుట్టును దర్పణంబులును గల్గి ఆ

వేదికలయందు మెత్తని పట్టుతో చేయబడిన ఆస్తరణలును, ఉపరభాగంబున ముత్యములు, పవడములు జాలు వారు తోరణంబులును గల్గి, విశ్వకర్మ నిర్మాణచాతుర్యమునకు మచ్చుతునకవోలె, ధగధగాయమానమై వెలుగొందుచున్న అపుష్పకవిమానమును జూచి రాముడాశ్చర్యచకితుడయ్యెను. అంత సీతా లక్ష్మణులతో పుష్పకమధిరోహించెను. సుగ్రీవ హనుమ, దంగద జాంబవంతాది వానరవీరులందరును ఆనందోత్సాహంబున దానినెక్కిరి. విభీషణుడు కొంతమంది మిత్రులతో నావిమానము నందెక్కిన తోడనే నాదివ్యవిమానము రివ్వున నాకసమునకెగిరి పోవుచుండ వానరులందరు ఆనందమున శ్రీరాముని స్తుతించుచుండిరి. రాముడును సీతకాభూభాగమును యుద్ధభూమిని జూపుచు –

సీ.:- ఇంద్రాది దేవతలెల్లర నోడించి
యష్టదిక్పతులనే యణగ జేసి
ధనదుని నెదిరించి దగునని యాతని
ఘనపుష్పకంబును గట్టి దెచ్చి,
మహిలోన మకుటాయ మానమై వెలుగొందు
లంకాపురంబును శంకలేక
అరివీరుడై యేలె నభవుని కృపచేత
సామాన్యుడే జూడసాధ్వి యితడు — 292

తే.గీ.:- బ్రహ్మదేవుని మెప్పించి బడసినట్టి
వరసముచ్చయ శక్తియొప్పంగవరలె
అమిత బలశాలి యైయీ యసురవరుడు
విధివశంబున గూలెను వింతగాను || — 293

కం:- ఇచ్చట బడియెను లక్ష్మణు
డిచ్చట సంజీవి దెచ్చి యిచ్చెను నసువుల్
జచ్చిన వానరులందరు
నచ్చరులొందంగ బ్రతికె హనుమంతునిచే || — 294

ఆ.వె.:- వనధి దాటి వచ్చి వైరిని జంపంగ

కట్టినాము దీని దిట్టముగను
పర్వతంబులన్ని బట్టి తెచ్చినయట్టి
వారువీరె సుమ్మ వానరములు 295

## శ్రీరాముడు సేతువుదరిని రామలింగని స్థాపించుట

వచనము:- అని శ్రీరాముడు సీత కయ్యా విశేషంబులుదెలుపుచు సముద్రమును దాటుచుండ నట నొకభూతంబోయను నటుల జీమూతసంఘమై, విమాన మార్గంబున కడ్డమై శ్రీరాముని కన్నులకంధకారబంధురమై దోప రాముడు విస్మయాంతరంగుడై, యిదియేమి! దారియంతయు నంధకారమయ్యె,! లక్ష్మణా! జూచితే! మున్నిది మనకగు పడెనా! యన లక్ష్మణుడన్నా! తెరవుబాగుగా గన్పట్టు చున్నదే, అంధకారమేమి! ఇది దివసమేగదా! యన రాముడు మరింత ఆశ్చర్యమునొంది తన నేత్రంబులు దుడుచుకొని జూచిన తనముందు భయంకరాకారము చ్ఛాయా మాత్రముగా గోచరించెను. ఆచ్ఛాయతన నడ్డగించునటులుండ రాముడు తలపైకెత్తి ఆకసముదెస జూచెను. అంత అశరీర వాణి బల్కులు విననయ్యె - 296

కం:- భూసుతకొఱకును నీవా
భూసురు జంపితివి గాన బొందెను, నిన్నా
భూసుర హత్యాపాపము
గాసించుచు వెంట బడియె గావున నిపుడే 297

కం:- ఆపాపము దొలగంగా
నీ పావనీ భూమియందు నీశ్వరలింగం
బేపుగ నెలకొల్పిన నీ
కావరమేశ్వరుడెయిచ్చు నన్నిశుభంబుల్ ॥ 298

కం:- సాగరతటమున నిచ్చట
నాగౌరీనాథుడైన నభవుని పూజల్
వేగమె జేసి అయోధ్యకు

నేగుము దోషంబు దొలగి యేర్పడు సుఖముల్ ॥ 299

వచనము:- అది విని రాముడా సాగరతటమున విమానమాపించి దిగెను. చుట్టును జూచి అచ్చట పరమేశ్వరునెట్లు ప్రతిష్ఠింప వలయునో యని జాంబవంతునితో 300

కం:- ఈ తీరంబున నీశ్వరు
నే తీరున నిలుపవలెనొ యెరిగించుతునన్
వాతాత్మజుండు దేవతె
శీతాచలమునకు నేగి శివలింగంబున్ ॥ 301

కం:- అని బలుక జాంబవంతుడు
గనుగొని రాముండు హనుమ! కడువేగంబున్
జని తేవలయును లింగం
బన నపుడేయేగె హనుమ యతివేగమునన్ ॥ 302

వచనము:- శ్రీరాముడా సాగరమున స్నానమాచరించి శుచియై సీతాలక్ష్మణ సహితుడై సుగ్రీవ విభీషణాది వీరులు బరివేష్టింప హనుమంతుని రాకకొఱకెదురు జూచుచుండె. నంత 303

తే.గీ.:- భానుడస్త్రాద్రి జేరంగ పరుగులెత్తె
అంజనేయుండు రాడాయె నంచువేగ
సైకతంబున జేసెను జక్కనైన
లింగమొక్కటి శ్రీరామ లింగమనగ ॥ 304

తే.గీ.:- సేతుదరినిల్పి శివునకు జేసెపూజ
లర్చనలు జేసి స్థాపించె నభవునచట
అఘము దొలగంగ ప్రార్థించి రంతలోన
వచ్చె లింగమ్ముతోగూడ వాయునుతుడు ॥ 305

తే.గీ.:- నేనుదెచ్చిన లింగమే నిలుపవలయు
ననుచు పంతమ్ము బట్టెనా అనిల సుతుడు
రాముడా లింగమును నిల్పిననియె నిట్లు
నీవు దెచ్చిన శివునకే నిత్యపూజ 306

తే.గీ.:- జరుగగాగలదిటుపైన జగతియందు

ననుచు రాముడు దీవించె నాంజనేయు
హనుమదెచ్చిన యాలింగమందుచుండె
నర్చనాభిషేక జలంబులన్నిగూడ ॥ 307

వచనము:- అని బలికి రాముడు సీతాలక్ష్మణ సహితుడై విభీషణ, సుగ్రీవ, హనుమదంగదాదులతో మరల పుష్పకమధిరోహించి, నయోధ్యాభిముఖుడై పయనించుచు భరద్వాజ మహాముని ఆశ్రమమున దిగి, ఆ మహాత్ముని సేవించి యాతని ఆతిధ్యాశీర్వాదములనంది, అయోధ్యవైపు పయనము సాగించెను. హనుమంతుడు ముందుగా నేగినంది గ్రామముననున్న భరతునకు రామాగమనమ్ము నెరిగించెనంత నంతోషంబు భరతుడు శత్రుఘ్నునితోడను, మంత్రిసామంత పరివార జనంబులతో రాముని రాకకై వేయికన్నులతో నెదురు జూచుచుండగా పుష్పకము నంది గ్రామము వద్దనాగెను. శ్రీరాముడు సీతాలక్ష్మణులతో పుష్పకము దిగెను. విభీషణ, సుగ్రీవ, జాంబవంత, అంగద, హనుమదాదులా వెనుకనే దిగి రాముని వెనుకగా నిలచిరి. ఆనందభాష్పంబులు కన్నులంజాలువార 308

కం:- ఎదురుగ వచ్చెడి యగ్రజు
పదములపై బడియెనపుడె భరతుడు నతుడై
యెదనత్తుకొనియె రాముడు
మదినలరుచు ప్రేమతోడ మన్నించి వడిన్ ॥ 309

తేగీ:- చిన్నితమ్ముడు శత్రుఘ్ను చింతదీర్చి
కౌగలించెను రాముడు కరుణతోడ
నచట నిలిచిన మంత్రుల నాదరించి
గురువులకు మ్రొక్కి వారల కుశల మడిగె ॥ 310

తే.గీ:- పౌరులను పేరు పేరున పలుకరించె
ప్రేమమీరగ వారలు ప్రియము జెంద
కనుల నానంద భాష్పాలు గ్రమ్ముకొనగ
సీతదీవించె మరదుల చింతదీర ॥ 311

సీ.ప:- అయోధ్య యంతయు నానందమొందెను
పౌరుల హృదయాలు పల్లవించె
కౌసల్య తనయులు కమనీయ గాత్రులు
తల్లికి మ్రొక్కిరి తనివిదీర
కౌసల్యయు సుమిత్ర కన్నీరు లొలుకంగ
గారాబు బిడ్డల గౌగలించె
తండ్రిని మరపించి తల్లుల నూరార్చి
సేదదీర్చెను రామచంద్రుడంత ॥ 312

తే.గీ.:- ఇట్టి జగదేకవీరుని నట్టనడవి
కంపి యపకీర్తి బొందితి నంచు కైక
చిన్నబోయెను మిక్కిలి సిగ్గుజెంది
కైక దరిచేరి రాముడు కలత దీర్చె ॥ 313

కం:- దనుజారి రామచంద్రుని
గనుగొని కైకమ్మ చాల కలవర పడియెన్
మనమున శంకాకులమై
వనజాక్షుని జూడలేక వంచెను శిరమున్ ॥ 314

వచనము:- శ్రీరాముడు కైక పాదములంటి జననీ! నాయందు గలనీ ప్రేమ అపారమైనది. నీ ఆజ్ఞవలన జగద్విఖ్యాతమైన పనులను సాధించి మహాత్ముల ఆశీర్వాదములను బొంది వచ్చితి. నీ మనమునగల శంకను విడనాడి, యెప్పటియట్లుగ నన్ను మన్నించుమన కైక రాముని గౌగలించుకొని, రామా! నాకు భరతుని కంటెను నీవే ప్రియమైనవాడవు. మనోవాక్కాయకర్మల నీ క్షేమమునేగోరు నేను, ప్రారబ్ధ వశంబున నిన్నడవులకంపి, మీ తండ్రి గారి మరణంబునకు కారణమైతిని. సుగుణాభిరాముని యడవులకంపితినను లోకాపవాదమును బొందితినని రోదించెను. రాముడు కైక నూరార్చి ఆమె మనో వేదన దీర్చి కలత బాపెను. 315

## శ్రీరామపట్టాభిషేకము

సీ.:- అయోధ్య నంతయు నందాలు జిందించి

రంగులు దిద్దిరి రమణులంత
గస్తూరి గలిపించి గళ్లాపు జల్లించి
ముంగిళ్ల ముత్యాలు ముగ్గులు నిచి
పచ్చని తోరణాల్ బవడంపు దీవాలు
రత్నాల కాంతులు రంగులమర
నెచ్చట జూచిన నెన్నియో సందడుల్
వెయ్యారు వేడుకల్ వెల్లివిరిసె ॥ 316

తే.గీ:- మంచి ముహూర్తమనుచు యోచించి మునులు
సకల తీర్థంబులను దెచ్చి సంభ్రమముగ
వేదమంత్రాలు పఠియించి వేదవిధిని
రాజ తిలకమ్ము దిద్దిరి, రామునుదుట ॥ 317

కం:- బంగారు గద్దె మీదను
శృంగారము జింద రఘుకులేశుండుండెన్
బంగారు రత్నమకుటము
రంగులు జిందంగ నిడిరి రాముని తలపై ॥ 318

కం:- గురువులు వశిష్టులప్పుడు
పురుషోత్తముడైన రాము భూమీశునిగా
వరములొసగి దీవించిరి
పరమాత్ముడె రాముడంచు భక్తి దలిర్పన్ ॥ 319

కం:- వినుతించిరి సభలోగల
జనులెల్లరు సంతసమున జానకిరామున్,
కనుగొన్నవారి జన్మలు
కనులును సార్థకములంచుగవులునుతింపన్ ॥ 320

కం:- మ్రోగెను భేరీరవములు
మ్రోగెను ఢంకానగర మిన్నులుముట్టన్
మ్రోగెను సురదుందుభులే
మ్రోగెను జేజేలు రామమూర్తిని బొగడన్ ॥ 321

కం:- కురిపించిరి విరులెన్నో

సురవరులు దివంబునుండి చోద్యంబందన్
సురవైరి వైరి బొగడుచు
గరతాళధ్వనులు నిండె గగనము వెలిగెన్ ॥ 322

కం:- శ్రీరామచంద్రునకు జై
మా రామప్రభువునకును మంగళమిదిగో
శ్రీరఘువంశోద్దీపక
శ్రీరామా నీకు జయము సీతారామా ! ॥ 323

వచనము:- అని ప్రజలానందోత్సాహంబులతో శ్రీరాముని కీర్తించిరి. కనక పీఠమున పట్టాభిషిక్తులగు ఆ సీతారాములు సాక్షాత్ వైకుంఠవాసులైన లక్ష్మీనారాయణుల వలె విరాజిల్లుచుండ మునులానందంబున చేతులు జోడించి-- 324

స్తోత్ర:- కౌసల్య పుత్రం కమనీయగాత్రం,
కౌమారతుల్యం కరుణాలవాలం ॥
రామావతారం రఘువంశ తేజం,
శ్రీరామచంద్రం శిరసానమామి ॥ 325

దేవాదిదేవం దివిజాళి సేవ్యం
దివ్య ప్రభావం దురితాఘనాశం
సీతా కళత్రం శ్రితపారిజాతం
శ్రీరామచంద్రం శిరసానమామి ॥ 326

వీరాధి వీరం విభుదాది స్తుత్యం
వేదాంతవేద్యం విహగాధిరూఢం
శ్రీ విష్ణుదేవం సకలార్థ సాధ్యం
శ్రీరామచంద్రం శిరసానమామి ॥ 327

వచనము:- అని యివ్విధంబున దేవ, గురు, మౌని, జనంబులును, కవి, బుధజన, వందితలును, పురజనులును కొనియాడ, రఘువంశయశోభూషణుడగు దశరథరాముడు సీతారాముడై పట్టాభిరాముడై, ఆశ్రిత జనవత్సలుడై 328

సీ:- పట్టాభిషిక్తుడై ప్రభవిల్లె రాముండు

మునులెల్ల దీవించి ముదముజెంద
ఛత్రచామరములు చేబట్టి నిలువగ
భరత శత్రుఘ్నులు భక్తితోడ
సౌమిత్రి ధనువుతో సరసనే నిలువగా
నాంజనేయుడుభక్తి నడుగులొత్త
వామదేవులు గురువైన వశిష్టులు
స్వస్తి వాచకములు జదువుచుండ ॥ 329

తే.గీ:- రామచంద్రుండు నయోధ్య రాజునగుచు
నేలుచుండెను రాజ్యమ్ము నింపుమీర
ప్రజలు వేనోళ్ల రాముని ప్రస్తుతింప
తల్లులందరు నెంతయో తనివిజెంద ॥ 330

కం:- నెల మూడు వర్షములతో
విలసిల్లెను భూమియంత వేడుక గూర్చన్
ఫలియించెను సస్యంబులు
కలకల లాడుచును నుండె కనువిందగుచున్ ॥ 331

కం:- ఎరుగరు జనులే కరువులు
నెరుగరు రోగములు చౌర్యమెరుగరుకించి
త్తెర్ఘుగరు నకాలమరణము
తెరుగరు శ్రీరామచంద్రు డేలుచునుండన్ ॥ 332

కం:- స్వస్తి సమస్త జగముకు
స్వస్తి సకల లోకభూత చయమునకెపుడున్
స్వస్తి యగు గాక సర్వము
స్వస్తి స్వస్తి యనుచుదేవ సంఘము బల్కెన్ ॥ 333

ఇది శ్రీపరమేశ్వర భక్తి తత్పరులును, సదాచారసంపన్నులును, నార్వేల నియోగి బ్రాహ్మణులును, ఆత్రేయ సగోత్రులును, చాగంటి వంశీయులునునగు జోగిరాజుగారి ధర్మపత్నియు, శివభక్తి ధురంధరయునగు గౌరీదేవిచే విరచితంబగు "శ్రీ గౌరీరామాయణము" నందలి యుద్ధకాండము సర్వము సంపూర్ణము.

సర్వము శ్రీ పరమేశ్వరార్పణమస్తు
లోకాః సమస్తాః సుఖినోభవంతు,
లోకో సమస్తాం పూర్ణంభవతు,
లోకో సమస్తాం శాంతిర్భవతు,
లోకో సమస్తాం మంగళం భవతు,
ఓం శాంతిః శాంతిః శాంతిః

**యుద్ధకాండ సంపూర్ణము**

# శ్రీ గౌరీ రామాయణమునందలి

# ఉత్తరభాగము

# శ్రీ ఉత్తర రామాయణము

కం:- శ్రీరామచంద్రలక్ష్మీ
నారాయణ వాసుదేవనలినదళాక్షా!
తారకనామా రామా
శ్రీరఘు వంశాబ్ధిసోమ సీతారామా! 1

ఉ:- శ్రీరఘు వంశభూషణుడు సీతనుగూడి యయోధ్యయందునన్
పౌరజా నంబుసంతసిల బన్నుట లేకయె యేలుచుండెనా
సారసపత్రలోచనుడు సజ్జనులందరు బ్రస్తుతింపగన్
ధారుణి శాంతి బొంద తన ధర్మము దప్పకనెల్ల వేళలన్॥ 2

కం:- భరతుడు శత్రుఘ్నుండును
సరసనె నిలువంగ ఛత్రచామరములతో
చరణముల మ్రోల హనుమయు
వరధనువుతొ లక్ష్మణుండు వరుసగ నిలువన్॥ 3

కం:- కరుణాకరుడగు రాముని
పరిపాలనయందు పాడిపంటలతోడన్
వరలెను సస్యములన్నియు
కరువులెరుంగను భూమి కలకలలాడన్॥ 4

కం:- చనుదెంతురు ముదమందుచు
మునివరులెల్లరును రామమూర్తిని జూడన్
గనుగొని జన్మతరింపగ
వినిపింతురు ధర్మములను వివరముతోడన్॥ 5

తే.గీ:- రామ రాజ్యంబులో ప్రజల్ రమ్యముగను
వేద ఘోషంబులెప్పుడు వినబడంగ
సరస సంగీత వాద్యాలు చవులు నింప
నాట పాటలయందున నలరుచుండ్రు 6

కం:- రాజను పేదను భావము
నేజనులకు దెలియరాక నెప్పుడు విభుడై
యీ జానకి నాథుండే
రాజై వరలంగవలయు రాజ్యము సేయన్!! 7

కం:- పన్నులు లేవని తమతమ
మన్ననలను దెలియ జేసి మహారాజునకై
యెన్నగ తమ ధనప్రాణము
లన్నియు నర్పింప సిద్ధ మగుదురు ప్రజలున్!! 8

## వసంత ఋతువు వర్ణన

కం:- కాలము గడుచుచు నుండగ
నాలోపల వచ్చెనంత నామని తోడ్తో
పూలన్ని వెల్లివిరిసెను
కాలము కోరికలు రేపె కాముని రభసన్!! 9

కం:- మల్లెలు బూసియుడెందము
నుల్లసిలంజేయ మనుజులుత్సాహమునన్
పల్లవ పాణుల జేరగ
తల్లడ మందుదురు సంధ్యతరుణము కొఱకున్ 10

కం:- కోయిలలు కంఠమెత్తెను
హాయిగొలిపి వీనులకును హర్షము గూర్పన్
వాయువు శీతలమై మది
హాయిగపులకింప దనువు నలరించిగడున్ 11

కం:- చివురాకుల జొంపంబుల
నవ నవలాడుచును బూలునాట్యము సేయన్
నవమకరందపుగంధము
బవనంబున నాల్గుదెశల బరుగులు వెట్టన్ 12

కం:- కంతు వసంత జయంతులు
మంతనములు జేసి జేసి మనుజుల హృదయా
భ్యంతరముల గలగింపగ
నింతులు తమపతుల జేరి రిష్ఠము దీర్పన్!! 13

కం:- యువకులు తమకముతోడన్
జవరాండ్రన్ గలసి రతులు సల్పుచునుండన్
పవనుని దోడుగ జేకొని
యవకాశముజూచి మదనుడంబులనేయన్ 14

కం:- ఎక్కడ జూచిన సందడి
మిక్కుటమై వెల్లివిరియ మేదిని పతియున్
జక్కగ వనమున సతితో
నక్కంతునికేళిదేలి యానందింపన్ 15

కం:- తలచెను మదిలో రాముడు
జలకేళిందేలవలయు, జలజాక్షులతో
సలుపవలె విహారములని
బిలచెను తమ్ములను దరికి ప్రేమ దలిర్పన్ 16

కం:- వనమునకేగి వసంతుని
మనమలరగ పూజ జేయ మనమందరమున్
జనక తనయలందోడ్కొని
జనగవలయు నుత్సవంబు సల్పుట కొఱకున్ 17

వచనము:- గావున వసంతోత్సవమునకు దగునేర్పాటులు జేయవలయునన భరతుడు భక్తివినలయములు దీపింప వనవిహారమునకై యాయత్తముజేయ నంతిపురస్త్రీ జనంబులతో బయలుదేరి శ్రీరాముడు ప్రియసతియగు సీతతో సంతసంబున

విహరింపదొడంగెను. 18

తే.గీ:- ఆవసంతుని జతయున నరుగుదెంచె
పాలమున్నీటి ముద్దుల పాపడంత
వెలిగె నింగిని నేలను వెండిజేసి
మనుజ హృదయాలయందున మరులు నింపె 19

ఉ:- కంతుని మేనమామ నిశికాంతుడు వెల్గగ దూర్పుదిక్కునన్
వింతగుకాంతి పుంజములు వేడుక జేసెను మానసంబులే
వంతులులేక హర్షరసవారిధి దేలగ సంతసంబునన్
జింతలువీడి జేరుదురు చిత్తజుకేళికినెల్ల వారలున్ 20

శా:- సీతారాములు చింతవీడి మదిరంజిల్లంగ క్రీడించి తా
మాతంకమ్ములు లేకయే మనసిజున్నారాధనల్ జేయుచున్
బ్రీతింజెంద సమస్తలోకములు సంప్రీతిల్లి రంజిల్ల ప్ర
ఖ్యాతిం బొందిరి కామకేళి విదులై కాకుత్స్థులా తోటలో॥ 21

కం:- రేపులు మాపులు నెరుగక
నా పూదోటలను దిరిగి రానందపర
త్వాపూరంబుగ దంపతు
లా పూవిల్తునికి జిక్కిరందురుగూడన్॥ 22

కం:- మరచిరి తమతమ విధులన్
మరచిరి నగరమున కేగ మరచిరి యిండ్లన్
మరచి మరుచేత జిక్కిరి
మరచితి మని రాఘవుండు మదిలో నెరిగెన్ 23

కం:- మరచితిమి రాజ్యపాలన
మరచితి మిటుమరుల జిక్కిమన తల్లులనే
మరచితిమి తమ్ములారా
మరల వలయు వేగపురికి మసలకనింకన్॥ 24

కం:- అని బలికి రామచంద్రుం
డనుజుల నందరను జేరి యతివేగమునన్
జనుడని తొందర జేయన్

వినయంబున బయనమైరి వేగమె పురికిన్. 25

వచనము:- శ్రీరామచంద్రుదు సీతా సహితుడై రథమెక్కి నగరము ప్రవేసించెను. ఆ వెనుక రాజపరివారమును దోడ్కొని భరతుడు పురము ప్రవేశించెను. నగరమందలి యువకులు దమ తమ సతులందోడ్కొని యిండ్లకు జేరిరి. కొన్ని దినంబుల వరకునా మధురస్మృతులలో నానందంబున నుండిరి. 26

కం:- నగరంబు జేరి రాముడు
తగు విధముల ప్రజల సుఖము తనసుఖమ్మనుచున్
జగములు గొనియాడంగా
దగునని దేవతలు మెచ్చధారుణి నేలన్॥ 27

తే.గీ:- అలసి వచ్చిన కోడండ్ల నాదరింప
అత్తలరుదెంచజూచి యా యతివ సీత
మ్రొక్కె వినయమ్ము దీపింప, ముదము జెంది
గారవంబున కౌసల్య గౌగలించె 28

కం:- పదముల వాలిన సీతను
ముదమారగ లేవనెత్తి ముద్దుగ నపుడా
వదనము వీక్షింపగనే
మదిలో సందియముదోచి మగువతా బల్కెన్ 29

తే.గీ:- చిక్కిపోయితివేలనే చిట్టి తల్లి
నడుము సన్నము పొడవాయె మెడనుజూడ
కంకణమ్ములు వదులుగా కదులుచుండె
సడలె నగలన్ని నీ మేను వడలియుండె॥ 30

తే.గీ:- అనుచు కౌసల్య కోడలి నడుగుచుండ
సిగ్గులొలుకంగ సీతమ్మ శిరసు వంచె
ముద్దుకోడలి భావమ్ము ముదము గొలుప
సంతసంబున కౌసల్య చాలమురిసె॥ 31

తే.గీ:- రఘుకులంబును బండించ రామచంద్రు

దేవి సీతమ్మ గర్భమ్ము తేజరిల్ల
అంతిపురమందు స్త్రీలెల్ల . హర్షమొంద
రాజు హృదయాన సంతోషరాశి నిండె 32

## సీతాదేవికి సీమంతము జేయుట

కం:- గురువులు దెల్పిరి సీతకు
సరిగా నీమాసమందు జరుపగవలయున్
త్వరలో సీమంతంబును
వరమౌనుల బిల్వబంపవలయు నటంచున్॥ 33

కం:- సందడి పడుచును పరిజను
లందరు సీమంతమునకు నన్నియు గూడన్
నందముగా సమకూర్చిర
మందానందంబు తోడ నా వేడుకలన్॥ 34

ఆ.వె:- మునులు ఋషులు వచ్చి ముందుగా నగ్నిని
హోమగుండమందు నుంచి భక్తి
మంగళ మగుగాక మనరాజు కంచును
స్వస్తి వాచకములు చదివిచదివి॥ 35

కం:- మంగళ జలకము లార్చిరి
మంగళమగు నంచురామ మహిపతికిలలో
అంగన లందరు జనకజ
శృంగారము జేసిదెచ్చి సిద్ధము జేయన్ 36

కం:- వచ్చిరి బందుగులెల్లరు
దెచ్చిరి కానుకలు పెక్కు తేజముగూర్పన్
మెచ్చిరి సీతారాముల
కిచ్చిరి దీవెనలు ప్రేమ నీప్సిత సిద్ధుల్॥ 37

వచనము:- సీతారాముల చేత హోమంబు జేయించి, కులదేవతల

నర్చింపజేసి, అభిషేకార్చనలుజేయించి, నీవంత కార్యక్రమంబులు జరిపింప, శ్రీరాముడును బ్రాహ్మణ దేవతారాధనలు జేసి బ్రాహ్మణులకనేక గోభూహిరణ్యాదులు దానముజేసి వారలం సంతృప్తుల జేసెను. పరివార జనములకనేక వస్త్రాభరణములు ప్రసాదించెను. బంధు జనుల నాదరించి ఉచితరీతిని సత్కరించెను. వారును సీతారాముల నాశీర్వదించి తమతమ నెలవులకరిగిరి. కౌసల్యయు సీతాదేవికి నేయే సమయములందేయే కోరికలుండునో మనసెరిగి అపురూపముగా జూచుకొనుచుండెను. శ్రీరాముడును ప్రియసతినొక క్షణమైనను విడువక ప్రేమాదరంబుల మన్నించుచుండెను. రఘువంశము పండించు సీతా గర్భశుక్తి ముక్తాఫలమునకై వేయి కన్నులతో నందరును యెదురు జూచుచుండిరి. 38

ఆ.వె:- ఒక్కనాడు సీత నక్కున జేర్చుచు
రాముడనియె నిట్లు రమణి నీవు
యేమి గోరుచుంటి వెరుగంగ జేయుమా
నీదు మనసు దీర్తు నిక్కముగను॥ 39

కం:- అనవిని జానకి పతితో
వినయము దీపింపబలికె విపినమునందున్
ముని పత్నులతో నాడగ
మనసయ్యెను నాకు నాథమన్నింతురాకో॥ 40

కం:- గంగా తీరంబున గల
యంగనలను గూడి జలక మాడగ మరియున్
మంగళ కరమౌ వారల
సంగతిలోనున్న నెంత శాంతనిదలతున్॥ 41

తే.గీ:- నాతి యీ సమయమున వనంబులోన
నెట్టు దిరుగంగ జాలుదు వెరుగ లేవె
అన్ని యేండ్లుండియును గూడా నడవులందు

మరల దిరుగంగ దలచితే మగువ యిపుడు॥ 42

వచనము:- అనిరాముడు మనమున సంకోచమును బెదురును గలవాడై సీత కోర్కెను మన్నించ లేకను కాదనలేకను యొక్కింత యోచించి సమయమరిసినీ కోర్కి దీర్చగల వాడనని బుజ్జగించెను. 43

కం:- చదరంగంబుల నాడుచు
పదిలముగా జూచుకొనుచు పడతిని యెపుడున్
హృదయం బలరం జేయును
మదిలోనా రాముడెపుడు మరిమరి ప్రేమన్॥ 44

కం:- సొగటాలనాడు చుందురు
తగువని పందెములు వైచి దగవులుబడుచున్
జగదేక వీరుడగుతన
మగనిని యోడించి సీత మరిమరి మురియున్॥ 45

కం:- సతిచేత నోడి యొకనా
డతి పంతము మీరనాడె నవనీ పతియున్
వెతజెందగ నాపందెము
లతివను గెలిపించి రాము నవమానించెన్ 46

ఆ.వె:- పంతగించి విభుడు పలికె కోపంబున
నాడనింక నీతో అతివ వినుమ
మంతరించి నావే మరియేమి జేసితో
మాయ జేసి నావు మగువ నన్ను 47

వచనము:- అని రాముడాటను గలిపి లేచిపోయెను, సీతయు రామునోడించి యుడికించిన ఆనందంబున ఆటచాలించెను. యీ రీతిని సీతారాములాడుచు బాడుచు మహదానందంబున ప్రొద్దుబుచ్చు చుండిరి. 48

## సీతా పరిత్యాగము

వచనము:- దేవలోకమున దేవ వరులు వైకుంఠవాసుడగు ఆ మహావిష్ణువును భూలోకమునుండి యెట్లు రప్పింపవలయునా యని ఆలోచించుచుండిరి 49

ఆ.వె:- ఆది విష్ణువచట నాలక్ష్మితో గూడి
అవనియందు సుఖములందు చుండె
అసురవిభుని జంపి అవనిజాతను బొంది
మరల వచ్చుటయును మరచి యుండె|| 50

ఆ.వె:- విష్ణుమూర్తిలేక వేసారి పోతిమి
యెట్టుమనగ వలయు నేమి జేయ
మరలవచ్చు శౌరి మనకడకంచును
యోచనంబు జేసి వేచియుండె|| 51

కం:- ధారుణియందున దుఃఖము
పారముగా గలుగ వలయువారికి నిపుడే
వేరుగ జేయంగలిగిన
కారణమును జూపవలయుకాకుత్స్థునకున్ 52

తే.గీ:- వాణియేతెంచి నొక చిన్నవాడయందు
రజకులున్నట్టి యిండ్లలో రంధి జేసె
ఒక్క వాచాలుడగు వాడు నిక్కుచుండె
సతిని యేలను బొమ్మని పతితయనుచు 53

తే.గీ:- పెద్దలేతెంచి జెప్పిరి బుద్ధులెన్నో
గలతలనువీడి జేయంగ కాపురమ్ము
పరుల కొంపనున్నట్టి యీ పడతినేల
వెట్టి రాముండనేగాను వినుడు పొందు 54

వచనము:- అని శ్రీరామునే విమర్శింప దొడంగెను 55

తే.గీ:- నిత్యము దశరథరాముడు
సత్యము దప్పకనుయేలు జనులను దయతో
నత్యంత మోదమందుచు
ప్రత్యక్షపరోక్షములను ప్రజలునుతింపన్ 56

తే.గీ:- అట్టి రాముని పాలన మందు గుప్త
చరులు నత్యంత దీక్షతో సంచరించి
చేరి జనులలో విషయముల్ సేకరించి
విన్నవింతురు రాజుకు విశదముగను 57

వచనము:- ఒక్కనాడొక గుప్తచరుడరుదెంచి తాను విన్న విషయములు రాజునకు నివేదింప శ్రీ రాముడు సంతుష్టాంతరంగుడై తన పాలనలో ప్రజలకేలోపంబులు కలుగ రాదు వారల సంతృప్తి యే తనకు కావలయుననియు బలికి నాపాలనయందేగాక నా నడవడి యందును గూడ ప్రజలు సంతృప్తులే గదా! అని అడిగిన, నావేగుచరుడు నిరుత్తరుడై యూరకుండె. అతని సంకోచమును గమనించి రాముడనుమానించి ఏమి? భద్రా! ఏమయిన విశేషముగలదా! నా యెడల జనులు యిష్టులై యుండిరా! సంకోచింపక చెప్పుమన భద్రుడు - ప్రభూ! పండిత పామర రంజకమగు తమ శాసనము నుందులోపములుండునా, అయిననూ ముష్కరుల మనస్సు రంజిపజేయుట దుష్కరము కదా అన రాముడు - 58

తే.గీ:- ప్రజల భావమ్ములెరుగుటే ప్రభుని విధియు
ఖ్యాతిగానిమ్ము లేకప ఖ్యాతిగాని
సంశయం బేల దెల్పుమా సంగతేమొ
నీదు కర్తవ్యమును నీవు నెఱప వలదె 59

వచనము:- అని బల్కు రాజునకు భద్రుడు - పట్టణమందలి ప్రజలు తమను కొని యాడుచుండ నొక ముష్కరుడేమేమో వాగి మిమ్ములను విమర్శించెను. మూర్ఖులును తాగుబోతులును వాగినవి లెక్కలోనికి రావుగదా! అన రాముడు - అధికులైనను

అల్పులైనను మమ్ముల గురించేమను కొనుచుండిరో మాకు తెలియవలయునుగదా! అందులకేమిమ్ము నియోగించినది. ఎట్టి విషయమైనను దెలియజేయుమని రాజాజ్ఞ. దానిని ధిక్కరింపక దెల్పుమన, భద్రుడు గడగడ వణుకుచు ప్రభూ! ఒకరజకుడు ముష్కరుడై భార్యను సంశయించి రాత్రి యెందో గడిపివచ్చితివి నిన్నేలను, ప్రజల మలినములను పోగొట్టి పవిత్రముజేయు పవిత్ర రజకకులమున జన్మించినవాడను. పౌరుషహీనుడను గాను పొమ్ము అని - పరుల పంచనున్న భార్యనేలుటకు నేను వెర్రి రాముడను గానని మిమ్ము విమర్శించెను. అట్టి మూర్ఖుని మాటలు తమకెరిగించలేకను రాజాజ్ఞను ధిక్కరించలేకను సంశయించితిని, మన్నింపుడు ఆ మాటలు తమరులెక్క చేయవలదని ప్రార్థించుచున్నానని బల్కి నమస్కరించి యేగెను. కర్ణ శూలంబులగు నా మాటలు విని రాముడు కూలబడియెను. కొంతపడి దుఃఖించి అయ్యో! సీతా! అయోనిజవగు నీకపవాదమా! నీ పవిత్రత నెరింగియులోకాపవాదమునకు భయపడియే నిన్నానాడగ్ని ప్రవేశింప జేసితి అయినను ప్రజలను మానించు చుండనోపు. హా! హతవిధీ! ప్రజలు సంశయంబున జూచుచుండ నేనెట్లు రాజ్యమేలగలను, రఘువంశమును పండించి కులదీపకుని ప్రసాదించ బోవు పవిత్ర మూర్తివి, నిన్ను వీడినేనెట్లు బ్రతుకగలను! నీతోసుఖించుచు ప్రజలనేలగలనా! నీతోగూడిన నా జీవితము ముఖ్యమా, ప్రజలు ముఖ్యమా, వద్దువద్దు, ఈ ప్రజలు ఈ రాజ్యము మనకు వద్దు ఈ రాజ్యము భరతునకిచ్చి మన మడవులకు బోయి సుఖముగా నుందము, అని దుఃఖాక్రాంతుడై కిరీటమును దీసి నేలకూలబడియెను. ఇంతలో అద్భుతముగా పీఠముపై నుంచబడిన కిరీటము ధర్మమూర్తిగా ఎదుట నిలచి-

ఓ రామచంద్రా! రఘువంశ యశోభూషణా! దశరథనందనా! నేనీ రఘుకులవీరులు ధరించిన ధర్మరూపమును,

నీవు నన్ను ధరించిన నాడే నా వశవర్తి వైతివి. యిక నీవు నీవుగావు. ధర్మానువర్తివి. ధర్మ స్వరూపుడవు. నీ స్వార్థమునకై నన్ను పరిత్యజింతువా! ధర్మరక్షణకై దిలీపుడు తన ప్రాణమైనను త్యాగమొనర్పదలచెను, ధర్మరక్షణకైరఘువు తన సర్వస్వమును దానము జేసెను. సత్య ధర్మరక్షణకై నీ తండ్రి దశరథుడు ప్రియ పుత్రుని విడచెను, ప్రాణమును విడచెను గాని ధర్మమును విడువలేదే! ఇట్టి ధర్మమూర్తుల వంశమున బుట్టి, ఇంతవరకును ధర్మరక్షా పరతయే జీవన పరమావధిగా దలంచిన ధర్మదీక్షాధురంధరా! నీ స్వార్థమునకై, నీ ప్రియపత్ని సీతకై ధర్మపరిత్యాగమొనర్తువా! ఇదియేనా నీ కర్తవ్యము! ఇదియేనా ప్రజారక్షణ! ఇదియేనా రాచపాడి! ఇదియేనా వంశప్రతిష్ఠారక్షణ? నీ సుఖమునకై ఈ రఘువంశకీర్తిని మంటగలిపెదవా! నీ పెద్దలందరును సుఖాపేక్షలేకయే కష్టములనుభవించిరా? లెమ్ము, కర్తవ్య విమూఢుడవుగాకుము. ధర్మరక్షణకే జన్మించిన నీవు ధర్మమునకై నీ సర్వస్వమును త్యాగము చేయవలెనన, యిక సీతయననెంత! అని ప్రబోధించి తిరిగి కిరీటముగా మారిపోయెను. రాముడు నిశ్చేష్టుడై కొంత తడవనట్లేయుండి, దుఃఖభరితమైన మనస్సును దిట్టబఱచుకొని ధర్మ బద్ధుడై, కృతనిశ్చయుడై, లేచి లక్ష్మణుని తోడితెమ్మని సేవకుని బుత్తెంచెను. ఝామురాత్రి గడచెను లక్ష్మణుడు శయన మందిరమునకేగె, నంతలో రామాజ్ఞ వినిన వాడై వెంటనే అన్నగారి మందిరమున కేగెను. గంభీరవదనుడై యున్న శ్రీరాముని జూచి నమస్కరించెను. 60

కం:- అన్న పదంబుల కెరగిన
జిన్నియనుజు జూచి బల్కె సీతాకాంతుం
డన్నా లక్ష్మణ వినుమా!
యెన్నగరానట్టి నింద యెంతయొ గలిగెన్॥ 61

కం:- లోకాపవాదమొదవెను

కాకూత్థ్సుల కేమియింక గౌరవముండున్
లోకులనిందను బొందిన
లోకులెటుల బ్రతుకగలరు లోకమునందున్ 62.

కం:- అన విని లక్ష్మణుడెంతయు
వినయముదీపింప భక్తి వెలయగ బల్కెన్
మన కపవాదము గలుగునె
ఘనులీ యిక్ష్వాకులంచు గానరె ప్రజలున్॥ 63

వచనము:- ధర్మరక్షా ధురంధరులీ రామచంద్ర ప్రభువుల కపవాదమా! అని రోషకషాయతలోచనుడై లక్ష్మణుడు బలుక రాముడు గంభీర వదనుడై, తమ్ముడా! ధర్మరక్షణకై మన మెట్టి త్యాగమైనను జేయవలయును గదా! ప్రభువు యెడల ప్రజలెల్లవేళలా భక్తి విశ్వాసములతో మెలగ వలయును. ప్రభువు ఆదర్శప్రాయుడై, సత్ప్రవర్తనుడై యుండవలెను. అట్టి ప్రభువునే ప్రజలాదరింతురు. లోభమోహంబుల జిక్కి, స్వార్ధపరుడగు రాజును ప్రజలు శంకింతురు. శంకాస్పదుడగు వాడు శాసకుడు గానుండదగడు. ప్రజారంజకమైన రాజధర్మమే నాకుగావలయును. అందుకొఱకు నేనేమయినను త్యజింతును. ఆ ధర్మము కొఱకు నేడు సీతను త్యజింతును. లంకాధి నాధుని చెరలోనుండిన సీతను రాముడు మోహంబున స్వార్ధపరుడై యేలు కొనుచున్నాడని నా ప్రజల చేతనే నాకపవాదము సిద్ధించెను. అగ్నియందు పునీతయైన సీత శీలమును శంకించు ప్రజలనెట్లు నమ్మించగలము. కావున సీతా పరిత్యాగమె తక్షణ కర్తవ్యము. అని బలుక లక్ష్మణుడు గుండె ఝుల్లుమన శోకముతో అన్నా! ఇదియేటి ధర్మము. అయోనిజయు, పతిసేవా పరురాలును, పరమ పవిత్రయునగు జానకీదేవిని త్యజింతువా! ఆమెను విడిచి నీవు బ్రతుకగలవా? ఈ మాటలు వినిన జానకీ దేవి ప్రాణములు నిలుచునా! యెవరో బాలిశుని పలుకులకు విలువనిచ్చి వైదేహిని త్యజింతువా!

రఘుకులదీపకులగు రామచంద్రుని యిల్లాలు, వంశోద్దీపకుని ప్రసాదించు పూర్ణ గర్భవతియైన సీతాదేవిని శంకించి మీకింత మనస్థాపమును గలిగించిన యాతుచ్ఛుని నాలుకనుచీల్చి వేసెదనని యొరనుండి ఖడ్గము దీయ - రాముడు తమ్ముడా! ఒక్కని జంపిన వచ్చిన కళంకము బోవునా! రేపు సూర్యోదయమునకు మున్నుగనే సీతను రథముపై గొనిపోయి గంగా తీరమున విడిచి రమ్ము. ఈ విషయమెవరికిని దెలియరాదు. నేనిక సీతను జూడజాలను. నీవిందేయుండుము. తెల్ల వారుఝామున సీతనరణ్యములదించి రమ్ము ఇది రాజుగా నా ఆజ్ఞ. కాదనిన నా మీద ఆన, అదియునుగాక సీత గంగాతీరంబున మున్యాశ్రమములందు ముని కన్నెలతో నాడగోరెను. కాన ఆ నెపంబున గొని పొమ్మని జెప్పి తన శయ్యయందు గూలబడియె. లక్ష్మణుడును చేయునదిలేక దుఃఖముతో నారేయి వేగించెను. 64

కం:- తొలి ఝాముగడిచి నంతనె
మలిఝామరుదెంచెగాని మందిరమునకున్
గలియగరాలేదనుచును
పలుమారా సీతజూచె పతిరాకకునై॥ 65

ఆ.వె.:- చూచి చూచి సీత వేచియుండగనంత
కలత నిద్దురందు కలను గనియె
తన్ను నొక్క గుహను తరిమిత్రోయుచునుండె
భూతమొక్కటి తన భుజము బట్టి॥ 66

వచనము:- అట్టి భయంకర స్వప్నమును గని భయభ్రాంతయై సీత మనసునందు కీడు దోప రామచంద్రుడు గూడ మందిరమునకు రాలేదని నిదురకు దూరమై కలతజెందిన మనస్సుతో నారేయి వేగించెను. అంత లక్ష్మణుడు తెల్లవారు ఝామున అశ్వశాలకేగి అశ్వములను రథమున బూన్చి భారమనస్కుడై సీతామాత

మందిరమున కేగి దుఃఖముతో - 67

తే.గీ.:- ఎంత ఘోరమ్ము గలిగెనేడింతలోన
పతిని యెడబాసి జానకి బ్రతుకునెట్లు
రాముడెటులనుండు రమణి బాసి
విధి విలాసమదెంతటి వింతయయ్యె॥ 68

తే.గీ.:- నాదు దుర్భాగ్యమేగదా నన్ను బంపె
పరమ సాధ్విని యడవుల పాలుజేయ
యేమి జెప్పుదు సీతకు నెట్లు యిపుడు
దీసికొని పోయి యడవిలో దింపివత్తు॥ 69

తే.గీ.:- రామచంద్రుని దేవి యీ రమణి సీత
కొమరుగని వెలిగించు మాకులమటంచు
తల్లులందరు యెంతయో తనియుచుండ
యెంత జేసెను దైవమ్ము నేమనందు॥ 70

కం:- ఏమని బిలువగదగునే
నేమని జెప్పుదును వనముకేవిధి సీతా
భామామణి గొంపోవుదు
నేమని యా రామునాజ్ఞనెరిగింతునొకో॥ 71

వచనము:- అని దుఃఖించుచు సీతను జేరి నమస్కరించిన సౌమిత్రిని జూచి సీత దీవించి యింతపెందలకడనే యేమి పనిగలిగె మీ అన్నగారు రాత్రి మందిరమునకు రాలేదని యడుగ, లక్ష్మణుడు తల్లీ రాచకార్యముననుండి రాలేదు. గంగా తీరమున మునికన్నెలతో నాడగోరెనుగాన సీతను గంగా తీరమునకు గొని పొమ్మని అన్నగారి ఆజ్ఞ. తేరు సిద్ధముగానున్నది దయసేయుడని కంపిత స్వరమున బలికెను. సీతయు సంతసంబున ముని పత్నులకు కొన్ని వస్త్రాభరణములు కానుకలుగానిచ్చుటకై రథముపైనుంచి మీ అన్నగారి సెలవంది వత్తునన లక్ష్మణుడు తల్లీ రాత్రంతయు నిద్రలేక అలసి పరుండెగాన యిప్పుడు నిద్రాభంగము

జేయవలదని ప్రార్థించి, తన వంచనకు తానే దుఃఖించుచు రథమెక్కెను. సీతయు తన వల్లభుడింత తొందరగా తన కోర్కె దీర్చుచున్నందున నంతనంబున రథమెక్కెను. రథమధిరోహించుచుండ దక్షిణ నేత్రమును భుజమును నదరి అపశకునము సూచించెను. లక్ష్మణుడతివేగముగా రథము దోలుచుండెను నగరవీధి దాటకుండగనే మార్జాలమెదురయ్యెను. అది చూచి సీత భయముతో లక్ష్మణా! అపశకునములు గననయ్యెను. మీ అన్నగార్కి చెప్పకయే వచ్చితిని నాకు రాత్రి దుస్వప్నము వచ్చినది సుమా! నా మనస్సాందోళనగా నున్నది. వన వినవిహారమునకు మనసం గీకరించకున్నది. రథమును వెనుక ద్రిప్పుము. మరియొక దినమున వెళ్లవచ్చును అని జెప్పుచున్నను లక్ష్మణుడు మౌనముగా రథవేగమును హెచ్చించెను. 72

తే.గీ.:- ఏమియునుమాటలాడక యేగు చున్న
చిన్న మరదిని జూచి యా సీత బలికె
దిగులు జూపించె నీమోము తీరు జూడ
చిన్నబోయితి వేలనో యన్న నీవు॥ 73

తే.గీ.:- నాడు కోరితిగాని యీ నాడు నేను
రామచంద్రుని విడచియా రామమందు
దిరుగ జాలను వేగమే ద్రిప్పు రథము
నేడు నామది కేలనో కీడు దోచె 74

తే.గీ.:- దుష్ట శకునమ్ము లెన్నియో దోచుచుండె
కష్టములు గల్గునని మది కలత జెందె
గంగ తీరంబునకు బోవగాదు యిపుడు
మరలిపోవుటె నగరికి మంచిదయ్య॥ 75

వచనము:- అని సీత భయాందోళిత మనస్కయై లక్ష్మణునాప, అతడు దుఃఖమ్మున బొగులుచు 76

తే.గీ.:- మరలిపోవంగ తరమౌనె మనకు నింక
వచ్చి నారమదియెగను వనము తల్లి
పరమ పావని యీగంగ పడతియింక
నిందు దిరుగంగ గోరితివిందు వదన॥ 77

వచనము:- అని రథమునాపిన సీతయు రథము దిగి లక్ష్మణుని దెస జూచిన నతడు కన్నీరు మున్నీరుగా ఆమె పాదముల బడి వెక్కివెక్కి యేడ్చుచుండ సీత భయముతో కంపించుచు లక్ష్మణుని లేవనెత్తి ఏమిది? లక్ష్మణా, యేమయ్యె! నాథుడు శ్రీరామచంద్రుడు క్షేమమేగదా! అయోధ్యయందు మన వారందరును సేమమేగదా! పతి సేవా పరాయణులును, సుకుమారులునునగు నాచెలియండ్లు కుశలమేనా! రఘువంశదీపకులగు మీ సోదరులు క్షేమమేగదా! నీ దుఃఖమునకు కారణమేమి! చెప్పుము తండ్రీయని అడుగ లక్ష్మణుడు కొంత తడవు మౌనము గా విలపించి - తల్లీ నీకేమని జెప్పగలవాడ 78

ఉ:- పాపపు రక్కసుండు చెరబట్టిన సీతను యేలె రాముడం
చేపగు నిందమోపినిను నేలుట దోషమటంచు దుర్జయం
బౌపలుగాకి కూతలకు నంబుజనేత్రుడు చింతజెందిని
న్నీపగదిన్ వనాంతరమహీస్థలి వీడగ బంపెతల్లిరో!॥ 79

కం:- ఆ మాటలు విని జానకి
యేమేమీ మరల జెప్పు మేమంటివి శ్రీ
రాముడు ననువిడనాడెనె
నా మూలంబునను పిందనాధునకగునే!॥ 80

కం:- నాడగ్నిని ద్రొక్కించెను
నేడీ విధిననున్న విడువనీతియె దనకీ
నాడొదవిన యపవాదము
వీడుటకై నన్ను నడవి విడువగ బంపన్ 81

కం:- సీత పరమపావనియని

యాతాపసివరులు దేవతాదులు బల్కన్
నాతోనేమియు జెప్పక
యీ తీరున విడువదగునె యిక్ష్వాకునకున్॥ 82

వచనము:- అని సీత గోలుగోలుననేడ్చుచు - లక్ష్మణా! నేనెట్టి నిర్భాగ్యురాలను నా జీవితమంతయు గానలకే అంకితమయ్యెనే, నా ప్రారబ్దవశంబున గంగా తీరమున మునికాంతలతో నాడగోరితి. చివరకు నాకోరికలడవుల పాలుజేయునని యెరుంగనైతి. ఆనెపంబున నన్నడవులకు దీసికొని పొమ్మని మీ అన్నగారు సెలవిచ్చిరా! యెంతటి అన్యాయము లక్ష్మణా! శ్రీరామునెడబాసి నేనెట్లు బ్రతుకగలను! పతికి దూరమగు సతికి బ్రతుకేల! అయ్యో! నన్ను నీ ఖడ్గమున దెగటార్చి ఈ దుఃఖము నుండి నాకు విముక్తి గలిగించుము. అట్లుగాదేని అదిగో పరమపావని గంగాదేవి యుండనేయున్నది. నా దుఃఖమును బోకార్చి తన గర్భంబున దాచు కొనునని యేడ్చు సీతతో లక్ష్మణుడు తల్లీ! నీ విట్లు బలుక దగునా! నిన్ను బాసి శ్రీరాముడు సుఖముగా నుండ గలడా! 83

కం:- ఆ వార్త విన్న దాదిగ
నేవిధి సీతకును జెప్పి యే విధి సతినే
నేవిధి విడతును నడవుల
హా! విధి మమ్మెంత జేసెయని రోదించెన్॥ 84

వచనము:- తన బహిఃప్రాణమవగు నిన్ను విడుచుట కెంత వ్యథ జెందునో నీవెరుగవా! రఘువంశవీరుడగు రామచంద్రుని తేజము నీ గర్భంబుననుండ నీవు ప్రాణ త్యాగమునకు బూనుకొనవచ్చునా! తల్లీ! జానకిదేవీ!! శ్రీరాముని యందు నీ ప్రేమ అనన్యమేని, మనోవాక్కాయ కర్మలా రాముని క్షేమముగోరు నీవా రాముని వంశాంకురమును రక్షించి కాపాడుదువుగాక! దానికి దప్పిన శ్రీరామునిపై ఆన సుమా! అని బలుక సీత - అయ్యో లక్ష్మణా!

నన్నెంతటి శిక్షకు గురి చేసితివోయి. మీ రఘువంశ వీరులెంతటి నిర్దయులు, ఎంతటి స్వార్థపరులు! మీ వంశ రక్షణ కొరకొక అబల జీవితమునే బలిబెట్టుచున్నారే! లక్ష్మణా! మీ అన్నగారికి ప్రజారక్షణయే ముఖ్యముగదా! నేను మాత్రమయోధ్యాపుర వాసులలో నొకతెనుగానా! ఇదియేటి రాజధర్మము, పురప్రజలలో నేస్త్రీకైనను ఈ కష్టము గలిగిన మహారాజు తన ప్రాణమైనను నిచ్చి వారి యార్తి దీర్చియుండును. నాదురదృష్టము వలన నేను రాణినైతిని, రామరాజ్యములో నొకస్త్రీకి గలుగు రక్షణ, అదృష్టమునాకు లేవుగదా! హా! పరమేశ్వరా! యెంతజేసితివోయి! మరణించుటకును జీవించుటకునుగూడ స్వతంత్రము లేకుండా మీ అన్నగారు నన్ను శిక్షించిరిగదా! ఇప్పుడీ కష్టమెవరితో జెప్పుకొందును! ఎట్లు బ్రతుకుదును! అయ్యో! అని యేడ్చుచు - 85

ఉ:- కైక వరంబుతో నపుడు కానలకేగితి సంతసంబునన్
నా కదియే వరంబనుచు నాథుని సంగతి వీడలేక నే
నా కఠినాత్ము రావణుని యాచెరలందున రాము రాకకై
యాకలి దప్పులన్ మరచి యచ్చట నుంటిని జీవితాశతో॥86

కం:- నేడేమని జీవింతును
నాడే నన్నగ్నియేల నాశముగాకన్
నేడీ విధి శిక్షించెను
రాడే నానాథుడింక రక్షింప ననున్॥ 87

కం:- లోకాపవాదమనుచును
కాకూత్థ్సులు కరుణలేక కారణమైనన్
నాకెరిగింపకయే యిపు
డీ కానల నన్ను విడువ నిది ధర్మంబే?॥ 88

వచనము:- లక్ష్మణా! లోకాపవాదమొదవినపుడు, అర్ధాంగినగు నాతో చర్చించవచ్చునుగదా! రాముని ధర్మపాలనకడ్డు నిలతునా!

రాజధర్మమునందు రాజునకున్న భాద్యత రాణినగు నాకుమాత్రము లేదా! నేనే నా నాథుని సెలవుదీసికొని అడవులకు వచ్చెడిదానను నన్నా మాత్రమర్థము జేసికొనలేకపోయెను. నా కోరిక యేనెపముగా వంచనతో నన్నడవుల కంపుట నన్నవమానము జేయుటయేయని మహారాజునకు మనవి జేయుము. రామచంద్రునికి నాకడసారి వందనములని జెప్పుము. అని గంగాతీరము వెంబడి యేడ్చుచు జనుచుండ, లక్ష్మణుడును దుఃఖముతో రథము మరలించుకొని పోయెను. 89

కం:- ముని బాలురు సమిధలకై
వనములదిరుగుచును నటకు వచ్చిరి, సీతన్
గనుగొని యచ్చెరువందుచు
మునివరు వాల్మీకి తోడ ముందుగ దెల్పన్ 90

వచనము:- శిష్యుల మాటలు విని వాల్మీకి సీత కడకు వచ్చి, శోకమూర్తియై యున్న యామెను జూచి యోగదృష్టితో విషయమంతయు గ్రహించి దరికి జేరి నిలచిన 91

కం:- గురువులు వాల్మీకుల కా
పరమాత్ముని దేవిలేచి భక్తి దలిర్పన్
కరముమొగిచి వినయంబున
వరమౌనికి మ్రొక్కినిలచి వదనము వంచెన్॥ 92

తే.గీ.:- రామచంద్రుని పట్టంపురాణివైన
నీకు దప్పులు గల్గనే నెలత వినుమ
అగ్ని నంటునె మనినము లవనిజాత
అమ్మ! రావమ్మ! జానకీ యడలనేల॥ 93

వచనము:- అని వాల్మీకి మహాముని ఆమెనోదార్చి, నీకు జనక సముండను చింత వీడి నాఆశ్రమమున నుండుము. నీకు శుభంబగునని దీవించి ఆశ్రమమునకు దోడిదెచ్చి, అచ్చటి మునికాంతల కామెను జూపి ఈమె వనదేవత మన ఆశ్రమమున

ఈమెకే లోటును గలుగనీయక సేవింపుడని వారల కొప్పగించెను. వారును సీతాదేవిని భక్తి శ్రద్ధలతో సేవించుచుండిరి. 94

వచనము:- లక్ష్మణుడయోధ్యకేగిన తోడనే సీతా పరిత్యాగ వృత్తాంతము అంతిపురమంతయు వ్యాపించెను. రాజమాతలును సీతా చెలియండ్లును గోలుగోలునఁనేడ్చుచుండిరి. పరివారజనమంతయు పరితపింప దొడంగెను. గంభీరుడై మౌనముద్రతో నున్న రాముని కడకెవ్వరును వెళ్లలేకుండిరి. 95

కం:- సీత నెడబాసి రాముడు
యాతనతో బొగుచుండెనట నిష్క్రియుడై
ఆ తాటక మర్ధనుడా
సీతనుమది వీడలేక జితిలుచుండున్॥ 96

కం:- జననొల్లడు రాముడు సభ
విననొల్లడు రాజకీయ విషయములేవిన్
గననొల్లడు యేరిని తన
మనమున నా సీతనెపుడు మరువక యుండున్ 97

తే.గీ.:- చేరవెరతురు రాముని చెంతకెవరు
మంత్రులైనను ప్రముఖసామంతులైన
తల్లులైనను భరతాది తమ్ములైన
అంతిపురమంత నీరవ మావరించె॥ 98

తే.గీ.:- మందిరమ్మును విడువడా మనుజ విభుడు
ప్రజల కష్టాలు వినరాడు ప్రముఖులైన
నిచ్చగించడు మాటాడ డేమియైన
భరతు డేజూచు నారాజ్యభారమంత॥ 99

తే.గీ.:- సీత నెడబాపి రాముని శిక్షజేసి
ప్రజలు సౌఖ్యమ్ములే విధి బడయ గలరు
కరువులే గల్గె జనులెల్ల గలత జెంద
లక్ష్మి లేకయె యాపుర లక్ష్మికుమిలె॥ 100

## కుశలవుల జననము

వచనము:- అచ్చట వాల్మీకి మహాముని ఆశ్రమము
జానకీదేవిని వనదేవతగా నారాధించి ముని కాంతలు యె
సేవించుచుందురు.

101

కం:- ముని పల్లెయందు సీతకు
మునికాంతలు సేవజేయ మురియుదురెపుడున్
మనమలరగ జేయుదురా
వనఫల పుష్పములు దెచ్చి వనితలు ప్రేమన్

కం:- అనవరతము రాముని దన
మన ముందున దలచు సీత మగువలతో నా
ముని యాశ్రమమున గల యా
వనతరు లతికాని కుంజ వాటిక బెంచున్

వచనము:- ఆశ్రమమును శుభ్రపరచుట యందును,
మృగపక్షిశాబకముల బెంచుట యందును ముని
వారించుచున్నను సీత వారతో ఆయాపనులయందు
చుండును. ఒక్కనాడా సీతాదేవి పూలమొక్కలక
బోయుచుండ వాల్మీకి మహాముని ఆశ్రమమునకు
సాధ్వీమ తల్లిని జూచి విచార విభ్రమంబుల -

సీ:- సాకేత నాథుని సతియైన సీతమ్మ
కష్టాలు పడుచుండె కానలోన,
పట్టు పుట్టంబులు బాగుగా ధరియించు
కాంత గట్టెను నేడు కావి చీర
చెలికత్తియల తోడ సేవలొందెడి రాణి
మునుల సేవలయందు మునిగి యుండు
పతితోడ సుఖియించు పడతి సీతాదేవి

పడియుండె నీరీతి పతిని బాసి|| 105

తే.గీ.:- రామచంద్రుని యిల్లాలు రమణి సీత
నిందు చూలాలి కే యిట్టి నిందగలిగె
విధివిచిత్రమ్ము లెంతయు వింతగాదె
యనుచు జింతించె మదిలోన యతివరుండు 106

వచనము:- అంతనొక్క శుభ ముహూర్తంబున - 107

తే.గీ.:- పంచ గ్రహములు గురునితో మించి వెలుగ
శుభమునే రాసులైదింట జూపుచుండ
రఘుకులేశుని యిల్లాలు రమణి సీత
గనియె సుతులిద్దరిని నొక్క కాలమందె 108

వచనము:- మునికాంతలు పరుగున బోయి వాల్మీకిముని పుంగవున
కావార్తనెరిగింప నతడును సహర్షంబుగ 109

కం:- కుశలంజేకొని వారల
కుశలమ్ముకై నాలవంబు గూర్చియునపుడే
కుశలార్థమంత్రములతో
కుశ రక్షలుగట్టజేసె గురువుల బేర్మిన్|| 110

కం:- కుశలవ మార్జన వలనన్
కుశలవులని పేరులుంచి గులవర్ధనమున్
యశమును గలుగగ వారిని
బశుపతి రక్షించుననుచు బలికెను మునియున్|| 111

వచనము:- వారి జనన లగ్నములు బరిశీలించి అమందానందంబున
జానకి దేవి కడకేగి - తల్లీ! నీ బిడ్డలసమాన
పరాక్రమ తేజోవిరాజులు. రఘువంశయశోభూషణులు,
శ్రీరామచంద్రునే. మించు పరాక్రమ సంపన్నులు
అయోధ్యాసింహాసన మధిష్ఠించి పెక్కేండ్లీ భూమిని పరిపాలింతురు
సుమా యని బలుక జానకిదేవి కన్నీరు మున్నీరుగా విలపించుచు

- పితృదేవా! నాకంతటి అదృష్టమా! రాజాంతఃపురముల నల్లారుముద్దుగ పెరుగవలసిన శ్రీరామచంద్రుని అనుంగు బిడ్డలీ యడవులలో ప్రచ్ఛన్నముగా నుండ వలసి వచ్చెనే! అయోధ్య యందు వైభవోపేతముగా జరుగ వలసిన పుత్రోత్సాహము మీ విధముగా అడవుల పాలయ్యెగదా! ఇది వినిన రామచంద్రుడెంతటి ఆనందము బొంది యుండును. జనని కౌసల్యాదేవి కెంతటి సంతసముగలిగెడిది నా దురదృష్టమువలన వారికిని నాకును గూడ సంతాపమే మిగిలెను. అని వాపోవు చున్న సీత నూరడించి తల్లీ! చింతింపకుము. నీ కష్టములు దీర్చి నిన్నారాముని కడ జేర్చెడి అసహాయ శూరులు నీ వద్దనుండ నీకు బెంగేల నమ్మా! వీరిని విద్యాధికులంజేసి అయోధ్యాసింహాసనమధిష్ఠింప జేసెద, నీవును నీ భర్తతోసుఖించగలవని యూరడించెను. వాల్మీకియు వారికి జాతకకర్మలు జరిపించి కుశలవులని శుభనామములుంచెను. సీతయు తన బిడ్డలను జూచుకొనుచు వారి ముద్దుపల్కుల కానందించుచు, వారల సంరక్షణలో తన బాధనా పసి వారలతో జెప్పుకొనుచు ఒక్కొకప్పుడు దుఃఖించుచు, నొక్కొపరి ఆనందించుచు వారల లాలన పాలనలతో ప్రొద్దుబుచ్చుచుండును.

112

కం:- జోజో రఘు కులదీపక
జోజో నానోముపంట జోజో తనయా!
జోజో మామాదశరథ
జోజో మాజనక రాజ జోజో తనయా!!! 113

కం:- మీ తండ్రి రామ చంద్రులు
మీ తాతా దశరథేశమేదిని పతియే
మాతా మహులా జనకులు
మా తండ్రీనిదుర బొందు మా వంశనిధుల్!! 114

వచనము:- ఈ విధముగా బిడ్డలంబెంచు కొనుచుండ వారు ఐదువత్సరముల ప్రాయము గల వారైరి. వాల్మీకియు వారల విద్యాభ్యాసమునకై తాత్కాలి కోపనయన సంస్కారము జేయించి విద్యలు నేర్పుచు ధనుర్విద్యయుందుగూడ వారల ప్రవీణులజేసెను. సింహకిశోరముల వలె నా కుశలవులు పదివత్సరముల ప్రాయమునకే సమస్త విద్యలయందును ఆరితేరిరి. వాల్మీకి తాను నారదప్రబోధము వలనసర్వజ్ఞుండై శ్రీరాముని దివ్యచరిత్రను "శ్రీ మద్రామాయణము" ను గ్రంథమును గాయత్రీ మంత్ర బీజాక్షరములతో సంపుటీకరణము జేసి ఆరు కాండలుగా రచించెను. (ప్రస్తుతము తన యెదుట జరిగిన చరిత్రను శ్రీరామనిర్యాణము వరకును ఉత్తరకాండగా తానే మొత్తము యిరువది నాలుగువేల శ్లోకములతోనేడు కాండలును రచించెననునది జగద్విదితము) తాను రచించిన "శ్రీమద్రామాయణము" ను కుశలవులకు నేర్పి వారిచే నారామాయణచరిత్రను దేశమంతటా ప్రచారముగావింప సంకల్పించిన వాడై వారలనా యత్తముజేసెను వారును రామగాథను మధురాతి మధురముగా గానము చేసి వినిపించెడివారు. కుశలవుల గానమాధుర్యమునకు ఆశ్రమ వాసులా బాల గోపాలము ఆనందమున తన్మయులై రామ భక్తులై రాముని పూజించెడివారు. కుశలవులకు శ్రీరాముని చరిత్రమత్యంత ప్రియమైనది. శ్రీరాముని తమ ఆదర్శ పురుషునిగా, గురువుగా, దైవముగా నారాధించెడివారు. శ్రీరాముని ధైర్యసాహసములు గానము జేయు నపుడు తామే శ్రీరామునిగా భావించి ఆ పాత్రయందు లీనమగు చుండిరి. వారివి జూచి జానకి ఆనందమును దుఃఖమును గూడా ననుభవించుచుండెడిది. 114

తే.గీ:- గురువు నానతిగైకొని కుశుడులవుడు
శ్రుతులు తాళంబు దప్పక కృతులు గూర్చి
రామచరితంబునంతయు రమ్యముగను

జూడు చూడుదురెంతయో భక్తిమీర॥ 116

తే.గీః- చదివి వినిపించు కుశుడంత చక్కగాను
అర్థమును జెప్పు నాలవుడభినయముగ
మధుర భావంబు లొలికించి మత్తుగొల్పి
తెలియజేయుదురా కథ తెల్లముగను॥ 117

సీః- అయోధ్య కేతెంచి యా బాలురిద్దరు
శ్రీరామచరితంబు చిత్రముగను
వీధుల దిరుగుచు వినిపించుచుందురు
ప్రజల వేనోళ్లతో ప్రస్తుతింప
విన్నారి కుశలవుల్ చిత్తములలరించి
గానంబు జేయగా కాంతలంత
పరుగున నేతెంచి పలుమారుజూతురు
రాచనగరునున్న రమణులంత 116

తే.గీః- ఎంత చక్కని బాలురే యింతి జూడు
ఇట్టి తనయులు గలుగగా నెట్టి తపము
జేసెనో తండ్రి యే పూజజేసె తల్లి
అనుచు బల్కుదురాపురి యతివలెల్ల॥ 119

వచనముః- కర్ణాకర్ణిగా వారిగురించి విని రాముడు వారలబిలపించిపాడ మనెను. తన చరిత్ర కన్నులకు కట్టినట్టుగా వినిపించిన వారి గానమాధుర్యమున కలరి, హర్షాతిరేకంబున నొడలు పులకింప తన సీతయేయాబాలుర రూపంబుననగుపడెను. ఆబాలురేగాక ఆ ప్రాంతమంతయు సీతామయమై కన్ను కన్నీటి కస్రువులర్ధమై మోహావేశంబున నేమియునుగవునించ లేకపోయెను. చిరునవ్వులొలికించు వారి ముఖారవిందములును అమృతప్రాయములగు వారి మాటలును జూచి తన సీత యేతన్ను పలుకరించుచున్న భ్రాంతిగలిగి సీతాసీతాయని దుఃఖించుచులోనికేగెను. కుశలవులును తమముని పల్లెకు జనిరి. 120

## "శ్రీరాముడశ్వమేధయజ్ఞము జేయుట"

తే.గీ:- రామచంద్రుని యిల్లాలు రాణి సీత
నడవి పాల్జేసినందున ననుభవింపు
డనుచు భూదేవి కోపించె ననగ కరువు
కాట కంబులతో ప్రజల్ గాసిజెందె!! 121

వచనము:- సుభిక్షమైన రామరాజ్యమును దుర్భిక్షము జేసుకొన్న దురదృష్టవంతులము. పరమసాధ్వీమతల్లియగు జానకీదేవిని నిందించిన పాపమూరకపోవునా! అని అయోధ్యావాసులు కరువుకాటకములతో బాధపడుచు- 122

తే.గీ:- ప్రభుతో జెప్పుకొనలేక ప్రజలు మిగుల
తల్లడిల్లుచునుండి రాతరుణమందు
గురువులరుదెంచి రామున కెరుగజేసె
అశ్వమేధమ్ముతో శాంతినందు మనుచు 123

కం:- సతిలేకను యజ్ఞంబులు
పతులేవిధి జేయగలరు పద్ధతి లేకన్
గతి దప్పి పనులు జేసిన
మతిమంతులు మెత్తురొక్కొ మహిపతినైనన్- 124

తే.గీ:- ఏకపత్నీవ్రతుండనే నెరుగరొక్కొ
యెట్లుజేయంగగలుగుదు యాగమనిన
గురుసమూహము ప్రజలమేల్కోరి బల్కె
స్వర్ణసీతతో యాగము సల్పుమనుచు 125

తే.గీ:- సమ్మతించెను రాముడు సఖియ సీత
స్వర్ణరూపముతో తన సరసనుండ
సంతసంబున యజ్ఞము సల్పుటకును
పురజనంబులు జాలనుప్పొంగు చుండ 126

కం:- గురువుల యాదేశమ్మున
వరసలవారిగను మంచివస్తువులెల్లన్
పురమందు జనులు దెచ్చిరి
మరియాదలు దప్పకుండ మహారాజాన్నకై 127

తే.గీ:- ఒక్క మూహూర్తమందున నొనరగాను
అశ్వమేధము జేయగా యవనిపతియు
పంచకల్యాణి గుఱ్ఱమ్ము పట్టి దెచ్చి
పట్టికను వ్రాసి శాసింప వదలి రపుడు 128

వచనము:- శ్రీరాముని ఆనతిని శత్రుఘ్నుడు చతురంగ బలములు వెంటరా అశ్వము వెనుకవెడలెను. అదియును అంగ, వంగ, కళింగ, మగధ మాళవాది దేశంబులు దిరిగి తిరిగి వాల్మీకి మహాముని తపోవన భూముల బ్రవేశించెను. యెక్కడ జూచినను ప్రజలు భక్తి ప్రపత్తులతో దానికి మ్రొక్కుచు, పూజించుచు రామునికి విధేయులైయుండిరి. ఒక్కనాడు లవుడు మునిబాలురతో నాడుచు అటుదిరుగుచున్న 129

కం:- యాగాశ్వమ్మును గనుగొని
వేగమె నాదరికి జేరి వింతగ జూచెన్
బాగుగ నున్నది భళిరే
యీగుఱ్ఱంబనుచు దానినెక్కగ దలచెన్ 130

వచనము:- ఆ లవుని జూచినంతనె యాగుఱ్ఱము మాలిమియైన రౌతునెద్దకు వలె కదలక బెదరక నిలచెను. లవుడు దానిని, నిమురుచు, బుజ్జగించుచు, దాని నుదుట గల పత్రికను జూచెను. అంతట లవుడాశ్చర్యంబున ఆగుఱ్ఱమునొక తరువుకడకు దీసికొనిపోయి, ఆచెట్టు మీదకెక్కి దానినుదుట గల పత్రికను విప్పి క్రిందకుదిగి అందలి విషయములు చదివెను- 131

సీ:- శ్రీరామ చంద్రుడా శ్రితపారి జాతుడు
రఘువంశసోముడు రామ విభుడు

ధర్మావతారుండు. దశరథరాఘుుండు
కౌసల్యబంగారు కడుపు పంట.
వీరాధివీరుండు విక్రమో పేతుండు
రావణ సంహారి రణవిజేత
దేవాదిదేవుండు దివ్య ప్రభావుండు
సాధురక్షకుడుసౌ జన్యమూర్తి 132

తే.గీ:- అట్టి అయోధ్యధవునిదీ హయము దీని
బట్టగాలేరు యెంతటి దిట్టలైన
పట్టగలవీరులెవరైన పట్టికట్టి
మమ్ము గెలిచిన యిత్తుము మాపురమ్ము॥ 133

తే.గీ:- అనుచు జదువుచు మరిమరీ యాగ్రహమున
మండిపడియెను లవుడంత మదిని చాల
వీరులే లేరు పొమ్మని విఱ్ఱవీగు
వీరి దర్పమ్మునడగించి వేతునేను॥ 134

తే.గీ:- వీరులేలేర భువిలోన వీరెగాక
యెరుగ జేసెద మాశౌర్యమెంత గలదో
హయము బట్టెద లెవ్వారలడ్డమైన
గడ్డి గరపింతు వారల గర్వమడచి॥ 135

కం:- హరిహరులడ్డంబైనను
దురగంబును ఏడువ నేను దురమున గెలుతున్
అరివీరభయంకరులము
ధరలో లవకుశుల గెలువ దరమెవ్వరికిన్॥ 136

వచనము:- అని లవకుమారుడు రోషకషాయిత లోచనుడై యొకనారతో నాగుఱ్ఱము నొకచెట్టునకు గట్ట, నదియునువానికి లొంగి యుండెను. మునిబాలురు భయముతో లవకుమారా! మనకీగుఱ్ఱమెందులకు? అదిగో! యేదోకోలాహలము వినబడుచున్నది. దీనికైగాబోలును. దీనిని వదలి పారి పోవుదమురమ్మన, లవుడు నేనీగుఱ్ఱమును

విడువను మీకు భయముగలిగినచో బొందని అక్కడనే ధైర్యముగా నిలచెను. వారును లవుని విడచిపోజాలక భయముతో అక్కడనే నక్కియుండిరి. ఇంతలో శత్రుఘ్నుని సైన్యము అశ్వము జాడలంబట్టి అక్కడకు వచ్చి బంధింపబడిన అశ్వమును దానిప్రక్కనే నడ్డిన చేతులుంచుకొని వీరరసావతారమోయను నటులనిలచిన తేజోమూర్తిని జూచి ఆశ్చర్యంబున - బాలకా! నీవేనా యీ అశ్వమును బంధించినదని యడుగ, లవుడు దర్పముట్టిపడ అవునని బలికెను. శత్రుఘ్నుడా బాలుని గర్వమునకు ముచ్చటపడి - 137

కం:- ఎవ్వరి బాలుడవోయీ!
యెవ్వరి దనిబట్టినాడ వీయశ్వమున్
ఎవ్వని దిరిగెడి వాడవు
యి వ్వారువమేల నీకు యెరుగంజెపుమా॥ 138

వచనము:- అన లవుడు - 139

కం:- పేరడుగుట మర్యాదయె
వీరులకెంతైనగాని వీరుగెవండున్
బేరును జెప్పునె లోకపు
తీరును గమనించి బల్కు దెలియదెనీకున్॥ 140

కం:- ఎవ్వరి వాడని జెప్పి
ని వ్వనిలో రణముసేయనెంచితొ జెపుమా
యివ్వారువంబు విడువమ
రెవ్వరు జెప్పిననుగాని యేమైననికన్ ॥ 141

కం:- బాలుని జూడగ మదిలో
చాలగ సంశయము గలిగె శత్రుఘ్నునకున్
లీలగ సీతారాముల
పోలికలే గానుపించి పొందెను ముదమున్ ॥ 142

కం:- బాలుడ నీమాటలువిన

చాలగ సంతసము గలిగె శౌర్యము జూడన్
జాలుదువే వీరుడనన్
బాలురతో నాడబొమ్ము పరుగున నింకన్ ॥ 143

వచనము:- అది విని లవుడు - 144

కం:- వీరుడవగుదవ యేనిన్
బోరుమునాతోడ లేద బొమ్మవలకు నీ
పూరకమాటలతోడన్
బోరకయే దీనినిచట బొందగ గలవే ॥ 145

కం:- బాలుని పల్కులు వినినే
జాలకనిను విడువలేదు జగడమనంగా
బాలుర యాటలుగావుర
నాలావును దెలియలేక నను జెనకెదవే ॥ 146

కం:- అనిబల్కి శరము బట్టెను
వినరాబాలకు డయింక వేయుదు శరముల్
గనజాలవు బ్రతుకియ్యెడ
మన జాలవు సుమ్మి యింక మరలుము వేగన్ ॥ 147

తే.గీ.:- చిన్న వాడవు నీవని జెప్పుచుంటి
పొమ్ము హయమునువిడచి మీఅమ్మదరికి
యెరుగ జాలవు యుద్ధము దేల నీకు
ఈడు వారలతో బోయి ఆడుకొమ్ము ॥ 148

వచనము:- ఆ మాటలు విని లవుడు - 149

తే.గీ.:- చిన్నవాడను నేనని యెన్నబోకు
శౌర్యముండిన ముందుకు సాగిరమ్ము,
వట్టి మాటలతోడనీ వారవమ్ము
బొంద గలుగుదువే నీవు బోరుగాక ॥ 150

కం:- అని గర్వంబున బలికెడి
చినవానిని జూడ జూడ చెందెనుక్రోధం

బని జేయముందు కురికెను
ధనుపును సంధించి వేసె దగిన శరంబుల్ ॥ 151

కం:- ఇరుపురు బోరిరి యచటన్
సరియగు శౌర్యమ్ముతోడ సరివీరులనన్
మరిమరి బల దర్పమ్ముల
గరిపై లంఘించి బోరు కరియేయనగన్ ॥ 152

కం:- శత్రువులను నిర్జించెడి
శత్రుఘ్నుడు గురియ జేసె శరవర్షంబున్
శత్రు జితుండగు రాముని
పుత్రునిపై నంతలవుడు పుడమినిబడియెన్ ॥ 153

తే.గీ.:- పడిన బాలుని దరికేగి పట్టి జూచి
ముద్దులొలికెడి యామోము ముదముగొల్ప
పట్టితన రథమందున బెట్టిజనియె
వచ్చి మునిసుతుల్గుశుని కావార్త జెప్ప ॥ 154

కం:- అది తెలిసి పరుగు పరుగున
మదిలో భీతిల్లి రథము మార్గములోనన్
పదములు తడబడ బాణం
బదరుచు వేయంగ దొడగెనా కుశుడపుడే ॥ 155

తే.గీ.:- ముందు జానుచున్న శత్రుఘ్ను ముందువేసె
శరము మంత్రించి సమ్మోహ శరమునపుడు
మంత్ర శక్తికి నాతేరు మళ్లవేగ
లేచి వచ్చెను లవుడవ లీలగాను ॥ 156

కం:- ఇద్దరొకదిక్కునిలువగ
ముద్దులొలుకుచున్నవారి మోములుజూడన్
అద్ది రెభళియని మనమున
నిద్దరి ధైర్యమ్ము మెచ్చె నెంతయొప్రేమన్ ॥ 157

వచనము:- ఆ కుశలవులనే జూచుచు పరధ్యానముగానున్న

శత్రుఘ్నునిపై వాడియైన బాణములిరువురును ఒకేసారి వేయనతడు నేలకొరిగెను. రాజభటులు పరుగున బోయి శత్రుఘ్నుని విషయమెరిగింప రాముడు విషాద విస్మయంబులు బెనగొన భరతుని బిలచి బొమ్మన నతడును బాలుర గెలచుట బ్రహ్మవిద్యయా! సైన్యమేలనని తానే రధమధిరోహింప లక్ష్మణుడును వెంట వెళ్లెను. మునిపల్లెదరి జేరి, అటుబంధింపబడిన గుఱ్ఱమును దానివద్ద జగజట్టిలవలె నిలచిన బాలురను జూచి –

158

కం:- హరిహరుల వోలెనిలచిన
సరిగానొక పోల్కినున్న చందముగనియా
దరి జేరి ప్రేమమీరగ
మరిమరి మెచ్చుచును మంచి మాటల తోడన్ ॥ 159

ఆ.వె.:- చిన్నవారు దెలియ రెన్నంగమీరలు
అడవి దిరుగు మీకు నశ్వమేల
రండు మాపురంబు రాజాకానుకలిచ్చు
రణమదేల మీకు రాముతోడ ॥ 160

వచనము:- అని భరతుడు వారలకు నచ్చజెప్ప వారును తమలోతాము నవ్వుకొనుచు. 161

కం:- వీరుడవైనను యిటులన్
గారడి వాక్యమ్ముతేల గాదని మమ్మీ
వూరక గొనిపోజూచితె
బోరక విడుచుటయెలేదు బొమ్మావలకున్ ॥ 162

వచనము:- అది విని భరతుడాగ్రహావేశంబుల, మూర్ఖులారా! పసివారలని జెప్పితిగాని చాలకగాదు. లక్ష్మణా యికవీరల విడువరాదు. వీరిని జంపియే అశ్వమును దీసికొని పోదము, అని శరమును సంధించి ఓరీ! దీనితో మీ ఆయువు సరిగాచుకొనుడు

163

తే.గీ.:- తలచుకొను తల్లిదండ్రిని దైవములను
అనిన భరతుని జూచి వారనిరి యిట్లు
పతిని జంపించి రాజ్యమ్ము సుతునకిచ్చు
తల్లి వంటిది గాదు మాతల్లి జూడ ॥ 164

కం:- అని బల్కెడి లవకుశులన్
గనుగొని క్రోధంబుతోడ కాలాంతకుడై
వినువీధి మంట లెగయగ
బనిచెనొక శరమ్ము వింట బంధించి వడిన్ ॥ 165

వచనము:- అగ్ని జ్వాలలు వెదజల్లుచు వచ్చెడి ఆ అస్త్రమును జూచి లవకుశులు ధనుర్బాణములు వదలి దానికి నమస్కరించి - మాతండ్రి దైవాంశ సంభూతులనిజెప్పిన మాతల్లివాక్యము సత్యమేని, సాధ్వీమణియైన మా తల్లి రక్షణలోనున్న మమ్ము నీవును రక్షింతువుగాక అనిబల్కిన -

166

తే.గీ.:- వహ్నిజిమ్ముచు బాణమ్ము వచ్చుచుండ
బాలురా బాణముకు మ్రొక్క భక్తిమీర
మరలె బాణమ్ము వెనుకకు మంటలన్ని
దాకె లక్ష్మణభరతులు ధరణి కొరుగ ॥ 167

వచనము:- మూర్ఛిల్లిన వారిని జూచి చారులు భయకంపితులై అయోధ్య కరిగి నమస్కరించి రామునికి విన్నవించిరి. 168

కం:- ఏమని జెప్పుదుమయ్యా
యే మహిమము గలదొగాని యెరుగండెవడున్
మేమెటు నిలువంజాలుదు
మీ మహి గెలువంగ జాలరెవ్వరుగూడన్॥ 169

కం:- బాలురు జూడగ మిమ్మే
బోలును శౌర్యమ్మునందు పృథ్విని యెవరున్

జాలరు వారిని గెలువన్
బాలురుగూల్చిరి సుమిత్ర పట్టిని భరతున్॥ 170

కం:- అన విని రామునికెంతయు
ఘనమగు దుఃఖమ్ము మదిని గలచెను చాలా
విననయ్యె యింత లీభువి
గననయ్యెను నేడు మనకు కాలముదప్పెన్॥ 171

వచనము:- అని కొంతసేపు దుఃఖించి లేచి సైన్యమాయత్తమై వెంటరా రథ మధిరోహించి ముని పల్లెదరికి వచ్చి అచ్చట పడియున్న తమ్ములను జూచి దుఃఖాక్రాంతుడై తనకింత దుఃఖము గలిగించిన వారెవరాయనిజూడ- 172

కం:- దశవత్సరముల బాలురు
దశదిశలన్ వెలుగజేయ ధైర్యము తోడన్
దశరథరాముడు దలచెను
పశుపతి ప్రత్యక్షమయ్యె బ్రహ్మతోగూడన్॥ 173

తే.గీ:- చిన్నబాలుర దెస జూచి తన్నుతానె
మరచె రాముండు దుఃఖమ్ము మరచియెంతో
తన్మయంబున వారల దరికిజేరి
అట్టె నిలచుండె తనరూప మనుచు దోచి॥ 174

వచనము:- విషాదమావహించిన తేజోమూర్తిని జూడగనే కుశలవులును తమమనస్సు కలచినట్టుగా యెద్దియో తెలియని అనుభూతికి లోనై
చేతులు జోడించి నమస్కరించిరి. శ్రీరాముడును విశ్మయానందంబు బెనగొన వారల దీవించి 175

కం:- ఏమిర బాలురు! మాతో
నేమని వైరంబు మీకి ద్వేషికిజెపుడీ!
యేమేమి వలసియుండిన,
మేమే యిచ్చెదము గొందు మీకి పుదనియెన్॥ 176

కం:- కోరిన యిచ్చెద నంటి వి
కోరుటకును యాచకులమె కోసలనాథా!
కోరినది బడయ గలయీ
వీరత్వమెగలదు మాకు వింటివ రాజా! 177

తే.గీ:- చిన్నవారల మేమని యెన్న బోక్రు
శౌర్యమున్నను మాతోడ జరుప్పు రణము
వట్టి మాటలు మనకేల బట్టు శరము
హయము గెలిచిన వారిదే అయ్యయెయ్యోధ్య॥ 178

వచనము:- అంత రాముడా కుశలవులతో- 179

సీ:- ఏమిరా బాలురు! యింత పంతము మీకు
నాతోడ యుద్ధమ్ము నడుపగలరె!
అట్టిప్రాయము నాడు తాటకి బరిమార్చి
ముక్కంటి విల్లును నుక్కడించి
దండకా వనమున దనుజాల హతమార్చి
బలశాలి యావాలి బలమడించి
వారిధి బంధించి వడిగ లంకకు జని
దశకంఠు జంపితి దిశలువెలుగ॥ 180

తే.గీ:- అట్టి నాతోడ బోరుట కెట్టివారు
చిన్నవారలు మీరు ననెన్నగలరె
హయము మీకేల బోయి మీరాడుకొండు
ముద్దు బిడ్డలు మీరేమి యుద్ధమేమి! 181

సీ:- ఆడుదానిని జంపుటదియొక శౌర్యమే
సాటివారితో పోరు సలుపవలయు
చివుకు విల్లువిరచి సీతను బెండ్లాడి
చెప్పుదువే నీవు గొప్పగాను
యెదురనిలచి బోరు టెంతయో న్యాయము
దొంగ చాటుగ జంప దొరతనంబె

దనుజులైననునేమి దగునని వారల
స్థావరంబులకేగి జంపదగునె|| 182

ఆ.వె:- ఆయు వెరిగి జంపనదినీకే జెల్లెను
వట్టిమాటలేల గట్టి పెట్టు
వెళ్ళి రక్కసులమె వెనుకాడుటకు మేము
రమ్ము గెలువు మమ్ము దమ్ములున్న|| 183

ఆ.వె.:- అనుచు బల్కువారి నాశ్చర్యముగ జూచి
రాముడనియె మీకు రణములేల
పప్పు దప్పళములు పలుమారుభుజియించు
విప్రసుతులు మీకు విజయమేల?|| 184

కం:- పలుమారు విప్రసుతులని
బల్కితివి మేమూరుకొనము బటు వీరులమున్
పల్కుమాటలేల రణమున
నిల్చి గెలువు శౌర్యమున్న నీవిపుడైనన్|| 185

కం:- ఆ పలుకులు విని రాముడు
తాపస బాలురకు నింత ధైర్యము శౌర్యం
బెపగదిగల్గునని మది
ఆ పసిబాలకుల జూచి యాలోచించెన్|| 186

తే.గీ.:- ఎవరిబిడ్డలు తలిదండ్రు లెవరిమాకు
యేది నామము కులమేది యెర్గగ జేయు
డెచటనేర్చిరి యీవిద్య లెవరుగురువు
ధన్యులేమిమ్ములనుగన్న తల్లి దండ్రి|| 187

వచనము:- రాముని మాటలు విని లవకుశులు నవ్వుచు - 188

కం:- కులగోత్రంబులు దెలిసిన
ఫలమేమియు గల్గుగబోదు పవరంబునకున్
కులనామము లక్ష్మంజే
దెలియుము వీరులకులంబు తేజమెగాదా!|| 189

కం:- నెయ్యపు మాటల వేటికి
విఖ్యాత మాకులమునామ మేలనునీకున్

వియ్యమునకు గాదుయిపుడు
కయ్యమునకు వచ్చినావు గద ఓరాజా!!! 190

కం:- తియ్యని మాటలతోడన్
నెయ్యంబున హయముగొనగ నెంచితివేమో
కయ్యంబున గెలువకనీ
కియ్యమునిక దీనినంచు యెరుగుము నీవే!! 191

వచనము:- ఇన్ని మాటలేల రమ్ము రణమున గెలచిన వారదే హయమును అయోధ్యయుగూడ అనిసవాలుచేయుచున్న లవకుశులజూచి రాముడాగ్రహావేశమ్ములతో శరముసంధించి విడచిన ఆ శరమునకు మ్రొక్కుచు బాలురు - 192

కం:- మాతల్లి పరమపావని
యా తల్లియె మాకు రక్షననవరతంబున్
మాతండ్రి దేవదేవుం
డాతడు ప్రేమైకమూర్తియై గాచుమమున్!! 193

వచనము:- అనకుశలవులపై వేసిన యారామబాణము వెనుకకు దిరిగి రాముని సైన్యమును మడియించెను. అది చూచి రాముడాగ్రహంబున నారాయణాస్త్రమును సంధించి నవమంత్రకవచముగా విడువనెంచిన నవమయమున వాల్మీకిమహాముని వచ్చి రామచంద్రా! ఆగుము, నీవేయలిగిన లోకంబులు నిలుచునే! అని వారి మధ్య నిలచెను. శ్రీరాముడు భక్తితో మునికి నమస్కరించెను. కుశలవులును వాల్మీకి గురువర్యుల పాదములంటి నమస్కరించిరి. వారిని దీవించి, శ్రీరాముని ముందు నిలిపి రామచంద్రా! ఈ శుభక్షణము కొరకే యెదురు జూచుచుంటిని, ఈ బాలురు మీ రఘువంశ యశోభూషణులు, శ్రీరామచంద్రుని బిడ్డలు, పరమపావని సాధ్వీమతల్లి జానకీ దేవి గర్భశుక్తిముక్తా ఫలములు, వీరు సీతనయులే సుమా! బాబూ! వీరే మీజనకులు

అయోధ్యాపురాధినాథులు రామచంద్రప్రభువు నమస్కరింపుడన కుశలవులు సంభ్రమాశ్చర్యంబున రాముని పాదములకడ మోకరిల్లిరి. శ్రీరాముడును తన్మయత్వమున, ఆనందభాష్పంబులు గురియ, బిడ్డలలేవనెత్తి, గౌగలించుకొనియెను. పుత్ర పరిష్వంగములో రాముడును, పితృప్రేమలో కుశలవులును మైమరచి కొంత తడవట్లే యుండిరి. రాముడు బిడ్డలమరి మరీ కౌగలింపుచు చెక్కిలిపుడు కుశిరములు మూర్కొని వాల్మీకులజూచి – గురువరా! ధన్యుడను. వీరిని జూడగనే యేదియో అనన్యమైన అనుభూతికి లోనైతిని. నాదేవి జానకీదేవి క్షేమమేగదా! మునీంద్రా నా సీతను కాపాడి, నా బిడ్డలనింతటి వీరులనొనర్చి నన్నును, నావంశమును నుద్ధరించిన మహాత్ములు మీకివే నాకృతజ్ఞతా పూర్వకమైన నమస్కృతులని ఆ ముని పాదముల చెంత మోకరిల్లెను. వాల్మీకియు రామచంద్రుని లేవనెత్తి రామా! నీ పుత్రులు వీరాధివీరులు అసహాయతేజోవిరాజులు సుమా! అన్నిటా నిన్ను మించిన వారలే అనివారలంబేర్కొని తన కమండలమందలి జలమునంజల్లిన అటుబడియున్న భరతలక్ష్మణశత్రుఘ్నాది సైన్యమంతయు నిదుర మేల్కాంచి నటుల లేచి శ్రీరామునకును మునీంద్రులకును నమస్కరించి సంగతినంతయు విని, అమందానందంబున కుశలవులం గౌగలించుకొని ఆనందభాష్పంబులు గురియించిరి. రాముడును మునివరా! జానకీదేవిని రప్పింపుడు మీ సెలవైన సీతను పుత్రులను దీసికొని అయోధ్య కరిగెదనన వాల్మీకియు సంభ్రమంబున సీతను దోడుకొనిరమ్మని బాలురనుబుత్తెంచెను. మునిపల్లెలోనున్న స్త్రీలందరును ఈ వనదేవత అయోధ్యాధిపతియైన శ్రీరామచంద్రుని యిల్లాలు సీతాదేవియేయని దెలిసికొని, సంభ్రమాశ్చర్యంబుల సీతాదేవిని దీసికొని వాల్మీకులున్నతావున కేతెంచి శ్రీరాముని జూచి భక్తితో

నమస్కరించిరి. సీతయు రాముని వద్దవచ్చి చేతులు జోడించెను. 194

సీ:- కాషాయ చీరతో కాయంబునే గప్పి
భూషణ రహితయై భూమి జాత
శుష్కించె దేహమ్ము శోకవహ్నిని చాల
దీనత్వమే ముఖదీప్తి యనగ
తనువు వడలె చాల తలకట్టుముడివైచి
పేదముత్తైదు వైప్రియుని జేరి
కన్నులారగ రాముగనుగొందునని జూడ
నానంద బాష్పాలు అర్ఘగించె॥ 195

తే.గీ.:- ఎట్టకేలకు దలయెత్తి యింతి సీత
నీదు తనయులగొనిదెచ్చి నీకొసంగ
పడితి కష్టమ్ము లెన్నియో పద్మనేత్ర
నాకు సెలవిమ్మువని దీరె నాధనేడు॥ 196

ఉ:- మోసితి నిందనేను నికమోయగ జాలను వీరు నీసుతుల్
దోసిలి యొగ్గి వేడెదను దోసములెంచకు రామచంద్రనే
రోసితి జీవితమ్ము ప్రతిరూపులె వీరలు నీకు బ్రోవుమో
కోసల నాధ యీవరము గోరితినింతియె జాలునాకికన్॥ 197

ఉ:- కల్లలు నమ్మి నాపతియె కానలకంపెను పూర్ణగర్భిణిన్
యుల్లమునందు నెంచుకయు యోరిమిలేకనునిందమోపి యీ
యెల్ల ప్రజల్ వినంగనిపుడేమని బల్కుదు నాదు శీలమున్
దల్లడమందె నాబ్రతుకు తల్లిరొ నాకిక తావెసంగుమా? ॥ 198

వచనము:- అని సీతముకుళితకరకమలయై భూదేవిని ప్రార్ధింప భూమిదద్దరిల్లి ఫెళఫెళా రావంబులతో సీతారాముల మధ్యగానున్న భూమి రెండుగా చీలి అందుండి రత్నమణిమయ కాంతులు విరజిమ్ముచు నొక దివ్యసింహాసనమున, సర్వాలంకార భూషితయైన భూదేవి అందరు జూచు చుండగ వచ్చి సీతదరికివచ్చి

ఆమెనక్కునజేర్చుకొని సీతతోగూడ ఆసింహాసనమున గూర్చొనగనే ఆదివ్యసింహాసనమా భూవివరంబున జొచ్చెను. ఎప్పటియట్లు భూమిగప్పబడియె. అది చూచి అందరును హాహా కారంబులు జేసిరి. కుశలవులాక్రదించుచు రామునిగౌగలించుకొనిరి. రాముడు కన్నీరు మున్నీరుగా దుఃఖించెను. ఈ హఠాత్ పరిణామమునకందరును జింతించిరి. వాల్మీకి మహామునియు శ్రీరామునూరడించి 199

కం:। సీతయభిమానవతియా
రీతిని నినుబాసి యిచట రేయింబవలున్
వాతాతపముల భూమీ
జాతమదిన్నిన్నెదలచి జరిపెను దినముల్॥ 200

వచనము:- అనవిని శ్రీరాముడు కొంత తడవు దుఃఖించి, సీతను తనలోనికి దీసికొని పోయి యింత విపత్తును గలిగించిన భూదేవిపై నలిగి శరము సంధించిన! పైనుండి అశరీర వాణి పల్కులు విననయ్యెను. 201

కం:- శ్రీమన్నారాయణ నీ
వీ మహిలోనవతరించి యీరూపంబున్
శ్రీ మీరగ ధరియించగ
నా మహాలక్ష్మియును సీతయై జనియించెన్॥ 202

కం:- గావున వైకుంఠమునకు
నీవును దయసేయవయ్యనిజమునగనుమా
గావలసిన పనులయ్యెను
యా వరలక్ష్మియును ముందు నరిగెను గానన్॥ 203

వచనము:- అదివిని రాముడు నిర్వేదముతో ధనువును పసంహరించుకొని
వాల్మీకి మహాముని వద్ద సెలవంది, తనయుల తోను తమ్ములతోను సైన్యము మరలించుకొని

అయోధ్యాభిముఖుడయ్యెను. అందరి ముఖములయందును విషాద మేనిండియుండె. తల్లికై దురపిలు కశలవులను దరికి జేర్చుకొని శోకమూర్తియై రాముడయోధ్యకు జేరెను. అవార్త దెలిసి అంతిపుర స్త్రీలందరును కుశలవులను గౌగలించుకొని సీతకైవిలపించిరి. శ్రీరాముడశ్వమేధయాగము సంపూర్ణముగావించి సీతావియోగమును దిగమ్రింగి తనయులతోనే ప్రొద్దు పుచ్చుచుండెను. ప్రజలకష్టములరయుచు ప్రేమాదరంబుల పాలించు చుండెను. 204

### శ్రీరాముని నిర్యాణము

రామ రాజ్యమును దిరిగి పొందితిమని జనులెల్లరును వినయ విధేయతలతో రాముని సేవించుచుండిరి. కొంతకాలమునకు కౌసల్యా కైకా సుమిత్రలు క్రమంబుగా యిహలోకబంధములు వీడి దివంబునకరిగిరి. భరతునకు దక్షపుష్కరులును, లక్ష్మణునకు అంగద చంద్రకేతులును, శత్రుఘ్నునకు సుబాహు శత్రుఘాతులును అను పుత్రులు దయించిరి. యుక్తవయస్కులగు తనయులకు రాముడు కోసల దేశమున "కుశావతి" యను పట్టణమును నిర్మించి అందకుశునకును, ఉత్తర కోసలమున "శ్రావిత" య[illegible] పురమును లవునకును ఇచ్చి పట్టాభిషిక్తులంజేసెను.

పశ్చిమ తీరమున గల సింధు ప్రాంతమున "తక్షశిల" యను పురమును భరతుని కుమారులగు దక్షునికి "పుష్కరాక్ష" మను పురమును పుష్కరునకు యిచ్చి వారలనుందు నధిపతుల జేసెను.

తూర్పుతీరమునగల అంగదేశమున కుత్తర భాగమున నున్న "అంగద" నగరమునకు లక్ష్మణ పుత్రులగు అంగదుని మల్లదేశమునకు చంద్రకేతుని నభిషిక్తులంజేసెను. దక్షిణ ప్రాంతమందు గల దేశములలో మధురానగరమును

సుబాహునకును విశిదాపురమును శత్రుఘాతునకు నిచ్చి శత్రుఘ్నుపుత్రులనయ్యా పట్టణముల కధిపతుల జేసెను. ఇట్లన్ని యేర్పాటుల నొనరించి తన ధర్మమును కర్తవ్యము నెరవేర్చి రాముడు సంతృప్తుడయ్యెను

శ్రీరాముని వైకుంఠమునకు దీసికొని పోవ దేవతల పంపున యముడు ముని వేషంబున రాముని కడకు వచ్చి, రామచంద్రా! నీతో కొన్ని రహస్యములు మాట్లాడవలయును. గావున నిందెవ్వరును నుండరాదు. ఎవ్వరేని వచ్చిన కఠినముగా శిక్షించవలయునని బల్కిన రాముడు లక్ష్మణుని ద్వారము కడకాపుంచి ఆమాయా మునిని దీసికొని రహస్యమందిరమున కరిగెను. ముని రూపధారియైన యముడు ప్రత్యక్షమై రామచంద్రా! నీ వచ్చిన పనులయ్యె గాన నీయీఅవతారమును జాలించి వైకుంఠమునకు విచ్చేయమని బల్కి అదృశ్యుడయ్యెను. వారు మాట్లాడు సమయమున దూర్వాసమహాముని వచ్చి రాముని గలుసు కొనగోరెను. లక్ష్మణుడందుల కియ్యకొనక రామాజ్ఞ నెరిగించెను. కాని మహాక్రోధ స్వభావుడును రుద్రాంశ సంభూతుడును నగు దూర్వాసుడు కోపించి 205

కం:- తాపసులమనుచు నెరుగక
నీపగిదిని నన్ను నాప నెంచిన మిమ్మున్
శాపంబిచ్చెదనని ముని
కోపంబున బల్కజూచి గుందుచు మదిలో|| 206

కం:- ఈముని శాపముతో కుల
మేమగునో యంచు దలచి యెంతయొ భీతిన్
రామాజ్ఞ మీరి లక్ష్మణు
డామందిరమునకునేగి అన్నకుమ్రొక్కన్|| 207

వచనము:- రామచంద్రుడును తన సత్యవ్రత దీక్షకై రాజాజ్ఞనుల్లంఘించిన లక్ష్మణునిదేశబహిష్కారముజేయ నతడును రామునివీడలేక

సరయూనదిలో మునిగి యోగమార్గంబున ప్రాణత్యాగముజేసి తననిజరూపమగు ఆది శేషువై వైకుంఠమునకు జనియెను. శ్రీరాముడును తనకార్యక్రమములన్నియు పుత్రులకొప్పగించి, దివదంబునకేగనిశ్చయించిన వాడై నభనేర్పాటు జేసిమంత్రిసామంతపుర ప్రముఖులనందరును బిలపించి సభాసదులనుద్దేశించి - మహాజనులారా! నేను వచ్చిన పనులయ్యెను. గాన,నేనీలోకమును వీడి దివంబున కరిగెద. ఈ అయోధ్య వాసులందరును జన్మరాహిత్యము నొంది స్వర్గమున కరుదెంచగలరు. నేడు నాతో రాగోరు వారీ శరీరముతోడనే దివంబునకు రాగలరని బల్కి అంతిపురము వీడి సభా భవనము గడిచి కాలి నడకనే కోట సింహద్వారమును గడిచి సరయూనదీతీరమునకు బయలుదేరెను. భరతశత్రుఘ్నులును మంత్రిసామంతాదులును పురమందలి వృద్ధులును పెద్దలను శ్రీరాముని వైకుంఠగాములై బయలుదేరిరి. ఆపట్టణమున గల జనులాబాలగోపాలము రాముని కడసారిగా జూడగోరి వారి వెంటనడువదొడంగిరి. 208

కం:- ఆనాడు దేవ దేవుం
డీ నగరాధిపుని యింట యీరాముని గా
మానవుడై బుట్టి మనల
కానందము గలుగ జేసి యలరించెగడున్॥ 209

కం:- ఆనాటి సంతసము మది
కీనాడేమయ్యె మనకు నేమనజెల్లున్
మానవ నాధుండిపుడీ
మానవరూపమున నింక మనకగుపడునే॥ 210

కం:- గావున మనమందరమును
బోవలయును రాముతోడ బొందుగననుచున్
రావలయు వేగ మేనని

దేవునితో బయనమైరి దివమును జేరన్॥ 211

వచనము:- అని పరుగు పరుగున వచ్చు వారును, శ్రీరామునకు భక్తి విశ్వాసములతో మ్రొక్కు వారును, ఎప్పుడైనను బోవువారమే గదా! ఇప్పుడు రాముని బోయిన దివ్య పదమును బొందగలమని ఒకరి నొకరు ప్రోత్సహించుకొనుచు రాముని వెనుకనే నడుపసాగిరి. అయోధ్యఅంతయు గదలి వచ్చెనాయన పెద్ద కోలాహలమయ్యెను. రామునితో బోవువారును, వారికి సంబంధించి యువకులును పసిబాలులును శ్రీరామునితో గూడ తమపెద్దలను కడసారిగా చూచుచు విషాద విస్మయంబులు బెనుగొన సరయూనదిని సమీపించిరి. కొద్దిమంది యువజనులను పసివారును దక్క మిగిలిన వారు రామునితో నుండిరి. అయోధ్య నిర్జన మయ్యెననునట్లుండె. ఈవిధముగా జరుగునని దెలిసియే రాముడు ముందుగనే కోసలరాజ్యమునకు 'కుశావతి'' ని రాజధానిగా జేసి కుశలవుల నందుంచెను.

ప్రజలందరును భయందోళనలతో జూడ, దినమునుండి దేవదుందుభులు మ్రోయుచుండగా అచ్చటి వారు తన్ననుసరింప శ్రీరాముడు సరయూనదిలోనికి నడచెను- 212

కం:- రాముడు జగదభిరాముడు
రాముడు వైకుంఠమేగ రయమునన దిలో
రామాయని ప్రజలు నుడువ
రాముడు దివ్యత్వమున విరాజితుడయ్యెన్॥ 213

తే.గీ:- నీలి మేఘుంపు ఛాయతో నిండి యున్న
దివ్య దేహమ్ము ధరియించి దిశలువెలుగ
శంఖు భరతుడు శత్రుఘ్ను చక్రమయ్యె
విష్ణువై యెల్ల వారికి విశద పరిచె॥ 214

కం:- గురియించిరి దివిజులు నట
విరివానలు సంభ్రమునను విష్ణువుమీదన్

చరణముల మ్రొక్కినిలచెను
కరివరదును బ్రస్తుతించి గరుడుడు గూడన్॥ 215

వచనము:- శ్రీరాముడు శ్రీమహావిష్ణువై శంఖుచక్ర గదాపద్మములు ధరియించి గరుడ వాహనారూఢుడై అందరును జూచుచుండరివ్వన ఆకాశమార్గంబున వైకుంఠమున కేగెను. రామునివెనుక సరయూనదిలో దిగిన వారందరును దివ్యదేహంబులతో ఆ మహావిష్ణువును వెన్నంటి బోయిరి. అది జూచి మిగిలిన వారున్ను ధైర్యముతో రామనామము స్మరియింపుచు నదిలో బ్రవేశించి కాంతి పుంజములు వెదజల్ల దివ్య శరీరములతో వైకుంఠమున కేగిరి. 216

కం:- భూవలయంబున ధర్మము
గావగన వతారమెత్తె కాకుత్థ్సుండై
శ్రీవిష్ణువె రాముడనగ
నా వరలక్ష్మియును సీతయై వెలుగొందెన్॥ 217

కం:- శ్రీరాముని చరితంబును
నోరారగ చదువ విన్న నుడివిన గానీ
కోరికలెల్ల ఫలించును
కూరిమి వైకుంఠపదము గూర్చునుతుదకున్॥ 218

కం:- మంగళము రామచంద్రా
మంగళమో కోశలేంద్ర మహనాయగణా
మంగళ మొసగెద నీకును
మంగళములు గలుగ జేయు - మాకందరకున్॥ 219

గద్యము:- ఇది ఆత్రేయసగోత్రోద్భవులును, ఆర్వేలనియోగి బ్రాహ్మణులును, చాగంటి వంశీయులును, అగు జోగిరాజుగారి ధర్మపత్నియు, శివ భక్తి ధురంధరయు, "శ్రీ వామలింగేశ్వర చరిత్ర" రచయిత్రియునగు గౌరీదేవిచే రచియించబడిన "శ్రీ గౌరీ రామాయణము" నందలి ఉత్తరకాండము సంపూర్ణము-

ఈ "శ్రీ గౌరీ రామాయణము" న బాలకాండమునుండి ఉత్తరకాండము వరకు ఏడు కాండలును రచియింపబడియె.

లోకాస్సమస్తా స్సుఖినోభవంతు
లోకాస్సమస్తా శ్శాంతిర్భవంతు
లోకాసమస్తాః పూర్ణోభవతు
సర్వం శ్రీరామచంద్రార్పణమస్తు
ఓం శాంతి, శ్శాంతి, శ్శాంతిః
సర్వమును శ్రీరామచంద్రార్పణమస్తు.

